Sri K. RAJAGOPALA RAO — Capital expenditure - Civil works క్రింద ఈ పోలీసువాళ్ళ ఇళ్ళు వస్తాయిగాని, దీని క్రిందికి రావు అనుకొంటాను

The Hon Sri N. SANJEEVA REDDI — Civil works క్రిందనే ఈ buildings రావచ్చు. కాని పోలీసు వాళ్ళ యొక్క ఇబ్బందులు వాళ్ళ కష్టసుఖాలు గుర్తుంచుకొని వలసిన అవసరమున్నదని ఇవన్నీ నేను ఈ సందర్భంలో చెప్పుచున్నాను. కనుక అప్పుడప్పుడు ఈ సిబ్బందిని ఒక చోటనుంచి ఇంకో చోటికి పంపించడం జరుగుతూ వుంటుంది. ఇటువంటి ఖర్చులు ఎన్నో వస్తూ వుంటాయి. ఈ విషయాలలో సాధారణ పరిస్థితులలో, వీటికి కొంతతక్కువే ఖర్చు కావచ్చు. ప్రత్యేక పరిస్థితులలో కొంత హెచ్చుగా ఉంటుంది ఇప్పుడు ఈ రాష్ట్రములో ప్రత్యేకంగా ఖర్చు ఏమి హెచ్చుగా లేదు. ఇతర రాష్ట్రాలలో, ఇంకా ఎక్కువగా ఖర్చుచేస్తున్నారు. ఇతర దేశాలలో పోలీసు సిబ్బందిని మరీ హెచ్చుగా పెంచుతున్నారని నేను అనుకొంటున్నాను. పోలీసు సిబ్బంది అత్యవసరమైనది కాబట్టి పెట్టుకోక తప్పదు. ఇప్పుడు ఉన్న పరిస్థితులలో, ప్రశాంతంగా ఉండాలన్నా, అందరికీ రక్షణ ఇవ్వాలన్నా, పోలీసు ఉండక తప్పదు.

పోలీసు అత్యవసరమే గాని, department 100 కి 100 పాళ్ళు బాగా ఉన్నదా అంటే, కొన్ని లోపాలుంటాయి. అందరూ మంచివాళ్ళుంటారా అంటే, మన మందరం మంచి వాళ్ళమయితే పోలీసుస్టేషన్లే అక్కరలేదు. పోలీసువాళ్ళే అక్కర్లేదు. సర్వీస్ లో కొంతమంది చెడ్డవాళ్ళుంటారు. మంచివాళ్ళూ యుంటారు. అంతా చెడ్డవాళ్ళే యుంటే ఏ సర్వీసులోనూ పని జరగదు. చెడ్డవాళ్ళు కొంతమందే యున్నారు. మంచి ఆఫీసర్లనూ, మదరాసు రాష్ట్రంలో పేరు ప్రతిష్టలు గలవారినే తీసుకున్నాం. వారు శక్తి వంశంగా కార్యక్రమం నడుపుకుంటున్నారు. ఆంధ్రరాష్ట్రంలో పోలీసువారు చేస్తూయున్న కృషికీ, వారు నడుపుతూయున్న కార్యక్రమానికి వారిని అభినందించక తప్పదు. మిత్రులు పోలీసువారి దినచర్యల విషయంలో గాని, వారి కార్యక్రమాల విషయంలో గాని, వారిలో లోపాలుంటే, ప్రభుత్వానికి తెలియజేస్తే ప్రభుత్వంతో సహకరించినట్లుంటుంది, అంటే మేము తెలియజేశాం మేము జాబులు వ్రాశాం ఎక్కడో Head Constable మీద report చేశాం నవ్వవచ్చునో

కూర్చుంటే చాదస్తంతప్ప వేరుకాదు. మరొకరివాదన. కల్లుగీతపని వాండ్రు 10% వున్నారు; వారి ఓట్లు సంపాదించడానికి రాజకీయ ఉద్యమంతప్ప మరేమీకాదు అంటున్నారు. మిత్రులకు సవినయంగా మనవిచేస్తున్నాను అది చాలా తప్పుడుఅభిప్రాయంఅని. ఓట్లు అనేవి ప్రజలు అంతచేలిగ్గాఇవ్వరని 1951 వ సంవత్సరంలో ప్రజలు రుజువు చేశారు. కొండంతబంగారంఇచ్చినా elections వచ్చేసరికి ఎవరిపెద్ద మనషితరహా ఎంతవున్నదో అంతా లెక్కగట్టి అప్పజెపుతారు. మూడు యేళ్లైనాకాలేదు, దాన్నిగురించి సందేహంలేదు. ప్రజల ప్రధాన సమస్యగా ఫలప్రదంకాని విధానంవల్ల వచ్చిన సమస్యను అర్థంచేసుకుని ముందడుగు వేయడంలోవున్నది పార్టీ భవిష్యత్తు, దూరదృష్టి. కొన్ని పార్టీలు వీనిని వుపయోగించుకుంటున్నారంటే మిగతా వారికి వుపయోగించుకోవడం చేతగాదన్నమాట. అంతేకాని వుపయోగించుకుంటున్నారని యేడవడం తెలివితక్కువ. కల్లుగీతగాండ్రు 10% అంటున్నారు. 5గురే కానివ్వండి. తరతరాలనుంచి ఆ వృత్తిమీదవారు ఆధారపడి బ్రతుకుతున్నారు. అయిదుసంవత్సరాలు నిరీక్షించారు. యేవృత్తిఅయినా చూపిస్తారని, ప్రభుత్వం చూపించలేకపోయింది, తరతరాలనుంచి వుండేవృత్తిని కాదని, సవ్యమైనవృత్తి చూపించలేనప్పుడుఅట్టివారిని చట్టాన్ని వ్యతిరేకించడానికే ప్రోత్సహించడం అవుతుంది. అప్పుడు ప్రభుత్వంవారి పోలీసులు, జైళ్ళుకూడా యేమీచేయలేవు. అందుచేతదీన్ని ప్రతిష్ఠకొరకు ప్రాకులాడకుండా రద్దుచేయవలసిందిగా కోరుచున్నాను.

*Sri K. SANTAPPA:— అధ్యక్షా, నాకు మాట్లాడడానికి అవకాశం ఇచ్చినందుకు గౌరవసభ్యులకు అధ్యక్షులువారికి హృదయ పూర్వకముగా వందనములు అర్పిస్తున్నాను. నేను త్రాగుబోతుతనం యెక్కువగా అలవాటుఅయిన హరిజనులలోనుంచి వచ్చినవాడను. యీవేళ మధ్యపాననిషేధాన్ని రద్దుచేయవలసిందిగా అనేకమంది ప్రతిపక్ష సభ్యులున్ను, ప్రభుత్వపక్షసభ్యులున్ను చెప్పుతున్నారు. త్రాగుడు గురించి మనపూర్వులు గ్రంథాలు, శ్లోకాలు చెప్పారు. రంకు బొంకులుకు రాజబాట, కలహములకు కన్నతల్లి, ఖూనీలకు కులదేవత

( శ్లోకం )

శుకం, పికం, బకం, శ్చైవ, హనుమాన్, రావణస్థత, కర్ణంచ,
కుంభకర్ణ సప్తైతే దోసులక్షణః.

1. శుకం అనగా చిలుక, ఒక కుంభ త్రాగితే చిలుకపలుకులు,

2. పికం అనగా గోరవంక, రెండవముంత త్రాగితే కిరించెలు.

3. బకం అనగా కొంగ, మూడవముంత త్రాగితే చుక్కలులో ఎండ్రకాయలుకు, చేపలుకు, జపము చేసినట్లు పనికిరాని ఆలోచనలు.

4. హనుమాన్ అనగా నాలుగవముంత త్రాగితే ఆగి కేయుటి కుప్పిగంతులు, కోతిచేష్టలు.

5. రావణాస్థత అనగా అయిదవముంత త్రాగితే, రావణబ్రహ్మ ప్రతాపము.

6. కర్ణంచ అనగా ఆరవముంత త్రాగితే దానకర్ణుడు.

7. కుంభకర్ణ అనగా తెలివితప్పి నిద్రపోవుట, వాంతిచేసుకొనుట (నవ్వులు)

హరిజనులు రాయలసీమలో వుండువారు, సర్కారు జిల్లాలో వుండువారు కోస్తాజిల్లాలో వుండువారు అందరు కూడా మధ్యపాన నిషేధము వల్ల లాభం పొందినారు. యిండ్లు కట్టుకోవడం, బట్టలు, నగలు, సంపాదించుకోవడం, ఇందుమూలంగా జరిగింది. దీనిని రద్దుచెయ్యాలి అనడం చాలా దుఃఖకరముగా వుంది. మహాత్ముని ఆశయం పూర్తి చేయాలని నామనవి.

కాబట్టి ప్రభుత్వ డిమాండుపై తెచ్చిన కోతతీర్మానం ఉపసంహరించుకోవలసిందనీ వచ్చే బడ్జెటులో దీనిని గురించి పునరాలోచించుకో వచ్చునని ప్రార్థిస్తున్నాను. యీ విషయంలో మమ్మలని అభివృద్ధికోకి తీసుకురమ్మని ప్రార్థన. ఇదివరలో త్రాగుడువల్ల మేమెంతో చాలా బాధపడ్డాము. ఇప్పుడు కొంతసుఖంగా బ్రతుకుతూ పనులు సక్రమంగా జరుపుకుంటున్నాము. తిరిగి దానిని ప్రవేశపెడితే మేము నాశనమై పోవడమే కాక ధనవంతులకు పలుకుబడిగలవాళ్ళకు జయం కలగజేసిన వాళ్లం అవుతాము. కాబట్టి డిమాండును బలపరచమని కోరుతున్నాను.

Sri. RAJA SAGI SURYANARAYANA RAJU :— అధ్యక్షా ! మద్యపాన నిషేధాన్ని గురించి మరొకసారి అంటే 6వ సారి మనవి చేస్తున్నాను. మనకు దైవికంగా, పట్టాభి రామారావుగారు Prohibition మంత్రిగా వచ్చారు. వారు రాజగోపాలాచారిగారి శిష్యులు, కాబట్టి Prohibitionను తప్పకుండా బలపరుస్తారనిఅంటే శిష్యుణ్ణేకాదు వారిని నేను దైవమే అనుకుంటున్నాను అని చెప్పారు. ఇటువంటి మహానుభావుడు అటువంటి వారిని దేవుడుగా భావించి నందువల్లే మనకిప్పుడు దేవుడులేకుండా పోయాడు (నవ్వులు)

నల్లమందు కొన్ని ఆరోగ్యకారణాలకు, సుస్తీచేసినవాళ్ళకు తప్ప అనేక దురలవాటుకోసం యెవరూ వాడడంలేదు. కాని ఈ నల్లమందు నిషేధించడం అన్నది 6 నెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మను పొడిచినట్లుంది. దీనిని అమలు పరిచినందువల్ల జబ్బులతో బాధపడేవాళ్ళ కష్టాలనెక్కువ జేస్తున్నామన్న మాట. రాజగోపాలా చార్యులవారు పూజ్యులుకావచ్చు శంకరాచార్యులవారిమతం యేమిటి? స్త్రీశక్తి వుంటని ఒప్పుకుంటారా. దీనిలో పరమరహస్యాలు చాలా వున్నాయిలెండి.

Prohibitionను యెవరు దిక్కరిస్తున్నారు? పెద్దరైతులు ఇంకా ఇతరధనవంతులు పెట్టుబడిపెట్టి సారాయితయారుచేసి పేదవాళ్ళ చేత అమ్మిస్తూ తమ పొట్టలునింపుకుంటున్నారు. కేసులువస్తే వారు తప్పించుకుని పేదవాళ్ళమీద తోస్తున్నారు. జమీందార్లమీద, ధనవంతులమీద కనికరం చూపుతున్న ప్రభుత్వం Prohibitionను యెందుకు తీసెయ్యకుండదు? ఆడబ్బు ప్రాజెక్టులకు యెందుకు ఉపయోగించకూడదు? వాంఛూగారు కూడా దీనిని తీసివెయ్యాలన్నారు దీనిని తీసివేయడానికిగాను కమిటీకూడా అవసరంలేదని చెప్పాము. 1 నెల 15 రోజులు ఇక్కడ కూర్చుని వాంఛూగారికన్న యేమాత్రం యెక్కువ చేస్తారో చూద్దాము. ఇకకొద్ది కాలమే కదా ఓపికపట్టండి. ఈ లోపుగా మనం' యేమిచేసినా వారిని అగౌరవ పరిచినట్లవుతుంది అంటున్నారు. యీ ప్రభుత్వం మనకేదో వొలకబోస్తానంటోంది. అందరూ దేవుళ్ళని భావించక దేవుడు వున్నాడని భావించి యీ కలియుగములో అవినీతిని మరింత యెక్కువ కాకుండా చూడమని కోరుతున్నాను.

Sri K. RAMAYYA CHOWDARY :— అధ్యక్షా! యీ మద్యపాన నిషేధచట్టం దాదాపు 1½ సం||ల నుంచి తీవ్రరూపం దాల్చింది. యీ రోజున అసెంబ్లీలో మాట్లాడిన విషయాలుచూస్తే యీ చట్టం సరిగా అమలు జరగలేదు కాబట్టి దీనిని రద్దుచేస్తే మంచిదని నా అభిప్రాయం, ఆర్థికంగాను నాగరికంగాను కూడా యీ చట్టం పతనమయింది. దేశమంతటా కాపుడుసారాయి యెక్కువయి అరాజకాలు, లంచగొండితనం పెరిగిపోయాయి. దీనినిప్పుడు తీసివేసినందువల్ల బడ్జెటును పూర్తిచేసుకోవచ్చు. Super Sulphateను భూములలో యెరువుగా వేసుకోడానికి యిస్తే దానితో సారాయి కాస్తున్నారు. యీ సారాయిలో వున్నవిషం ప్రజలకు చాలహాని కలుగజేస్తోంది. అరాచకాలు అరికట్టడానికి ప్రభుత్వం యేమీచర్య తీసుకోవడంలేదు. మొన్నొస్తు .. శాసనసభలో [illegible]

కోరాము. కాని అక్కడ అది రద్దుకాలేదు. ఇప్పుడు ప్రభుత్వంవారు శ్రద్ధతీసుకుని దానిని పరిశీలించడానికి కమిటీని వేశారు. ఇక వారి రిపోర్టురావడానికి 1½ నెలలటైము మాత్రమేవుంది. ఒకచట్టం ప్రవేశపెట్టేప్పుడు. రద్దుచేసేటప్పుడు మన అనుభవాలను ఆలోచించుకోవాలి, దొంగసారాయి తయారుచేయడం యెక్కువయినందువల్ల మద్యపాననిషేధచట్టాన్ని రద్దుచేసి కాంట్రాక్టు పద్ధతిని అమలు పరిచినప్పటికి ప్రభుత్వానికి ఆదాయంతగ్గవచ్చు. యీ చట్టాన్ని అమలు పరచడంలో కూడా ప్రభుత్వంలోటు చాలావుంది. మన ఆదాయం పెరగాలంటే దానిని రద్దుచేయాలనీ, నైతికాభివృద్ధి కావాలంటే చట్టం వుండాలనీ అంటున్నారు. కాని ఇటువంటి చట్టం వుండడంవల్ల ప్రజలలో నైతికాభివృద్ధి కల్గడంకల్ల. దేశంలో పరిస్థితులు ఆర్థిక మానసికతత్వాలు ప్రేరేపించబడి మానవులును ఒకరకమైన పతనావస్థలోకి తీసుకొస్తున్నాయి. మన ఆర్థికవ్యవస్థ బాగుపడ్డప్పుడే ఇవి బాగుపడతాయి. చట్టాలు మాత్రం మానవుల నేమీచేయలేవు. నైతికపతనానికి దారితీసిన యీ చట్టం ఇంకా వుండాలని ప్రభుత్వం కోరితే దానిని ఖచ్చితంగా దించగలము. కాన మన మీవిషయంలో ప్రభుత్వంమీద వత్తిడి తీసుకొచ్చి తగ్గించగలమని నా అభిప్రాయం. దొంగసారాయిని యెట్లా అరికట్టగలమా అని ఆలోచించాలి. కాబట్టి యీ 1½ నెలల టైము ప్రభుత్వానికిచ్చి రిపోర్టుఫలితాలకోసం వేచివుండమని కోరుతున్నాను.

SRI T. NAGI REDDI :— అధ్యక్షా, దీనిమీద చర్చలు మనం ఇప్పుడేకాక వుమ్మడి మద్రాసురాష్ట్రంలోకూడా చాలాసార్లు జరిపాము. అందరికన్న ఎక్కువపట్టుదలతో మద్యపాననిషేధాన్ని అమలు జరపాలని వుత్సాహభరితులును మంత్రులుగావున్నసందర్భంలో ఆయన మొత్తంరాష్ట్రాన్నే తన గుప్పెట్లోపెట్టుకొని మద్యపాననిషేధచట్టాన్ని సక్రమంగా జరపలేకపోయారని చూచినమనము రెండుసంవత్సరాలు చాలా శక్తిమంతులనిపించుకున్న ఒక ప్రముఖవ్యక్తి చేతిలోవున్న ప్రభుత్వం దీనిని అమలుజరపలేకపోయిందన్న సందర్భంలో మనం యీనాడు యీ చర్చలుజరుపుతున్నాము. 1952 సం॥లో కొన్నికొన్ని కారణాలచేత ఆనాడువున్న ప్రతిపక్షము మద్యపాననిషేధచట్టాన్ని తీసివేయాలని సూచనగానేకాకుండా దానిని వుంచాలా తీసివేయాలా అని విచారణచేయడానికి ఒక కమిటీనివేయాలనిచెప్పాము. రెండుసంవత్సరాలు గడిచిపోయింది. ఇప్పుడు అనుభవమువచ్చింది. యీ అనుభవంలో ఇక యీవిషయంమీద మనం నేర్చుకోడానికి సిద్ధంగాలేము. మనచేత దీనిని గుర్తింపచేయడానికి యీ కమిటీని వేసింది. మొన్న కమిటీ

లను యీప్రభుత్వం వేయలేదు- యెంతమందిరిపోర్టులుతయారుచేయలేదు! రాయలసీమ కోఆపరేటివ్ యెంక్వైరీకమిటీని వేసిందికాని వారిసూచనలను బుట్టదాఖలుచేసింది. రేపుప్రొద్దున్న కాబోతున్నాయి. మద్రాసు రాష్ట్రంలో ప్రజలకు అప్పుయెంతవున్నది అని చూడడానికి ఒక కమిటీని వేయడం, దానిసూచనలురావడం జరిగింది. దానిమీద మనంతీసుకున్న చర్య యేమిటి? అన్నిరిపోర్టులుఇదేవిధంగా బుట్టదాఖలుచేసింది. అంతే కాదు ఇక్కడ ఒకసమస్యవచ్చింది. ఇది లంచగొండితనాన్ని గురించి. ఇచ్చేవాళ్ళువుంటేగాని పుచ్చుకునేవాళ్ళుండరనిచెప్పడం చాలా ఆశ్చర్యకరమైనవిషయం. యీనాడున్నటువంటి పరిస్థితుల్లో లంచంఇస్తేగాని పనులుజరగడంలేదు. అంటే ప్రభుత్వంలో యెల్లకాలం లంచగొండితనం మిగిలేవుంటుందని చెప్పడంజరిగింది. ఇచ్చేవాళ్ళువుంటే తీసుకునే వాళ్ళుంటారు అనే ఒక నిర్ణీతమైనపద్ధతిమీద పనులు జరుగుతున్నాయి. అంటేయేమిటి! మీరు లంచంయివ్వండి నన్నెందుకుకష్టపెడతారు అనేట్టుగావుంది వారిచ్చినసలహా. ఆ సలహా యీ ప్రొహిబిషన్ అమలుపరచడంలో యెట్లావుందో, గ్రామాల్లో యెంత లంచగొండితనాన్ని పెంపు చేసేందుకు కారణంఅయిందని తెలుస్తుంది. పేదవాళ్లు గడ్డపారకొట్టి వాళ్ళదగ్గర డబ్బుతెచ్చి కట్టమంటారాఅని ఒకప్రశ్న. అసలు మన ప్రభుత్వం పేదవాళ్ళమీదకాకపోతే యెవరిమీద పన్నులువేస్తున్నది ? ప్రొహిబిషన్ పెట్టి సేల్సుటాక్సు వేసింది. అది యెవరుచెల్లిస్తున్నారు? అసలు యీ పన్నులస్వరూపమేమార్చాలి. బ్రిటిషుప్రభుత్వంకాలంలో వున్నటువంటి పన్నులవిధానాన్ని అమలుపరచే యీనాటి కాంగ్రెస్‌వారు పేదల మీదకాక ఇంకెవరిమీద వేస్తారు? యీమద్యపాననిషేధంఅనేది మనక్కొత్త కాదు ప్రారంభించింది. ఇతరదేశాల్లోకూడా ప్రారంభించి విఫలులయినారని మాత్రం మనం జ్ఞాపక ముంచుకోవాలి. దేశంలో ప్రజల ఆర్థిక స్థోమతు పెంచేంత వరకు ప్రజల cultural standard పెరిగే వరకు తుపాకులను పేల్చి అయినా దాన్ని అమలు పరచడమే వారిఆశయం. దీనివల్ల చరిత్రమనకు నేర్పినగుణపాఠం ఒకటి. ప్రొహిబిషన్ కేసెస్ రెవ్యూచేస్తే యీనాడు యెంతమంది పేదప్రజలు జైళ్ళకుపోతున్నది తెలుస్తుంది. యెన్నడైనా యీవిషయంలో ప్రభుత్వం సీరియస్‌గాఆలోచించారా? జైళ్ళకువెళ్ళేవాళ్ళలో పేదవాళ్ళు యెంత మందిఅనేవిషయం ప్రభుత్వంయెన్నడైనా రెవ్యూచేసిందా? వీటినిగురించి మాత్రం ప్రభుత్వం చాలానీతిగా మాటాడుతోంది! దీన్ని అమలుపరచడంఅసాధ్యంఅని గుర్తించకపోడానికి కారణంయేమిటి? నాఅనుభవంలో గ్రామాల్లో వుండే భూస్వాములకు యెవరికిన్నైనా కోపంవస్తే వారి

ఇంటిలో సారాయివున్నదని చెప్పి వాళ్ళఇంటిమీద దాళ్ళుచేసినదృష్టాంతరాలుకూడావున్నాయి. ప్రభుత్వం తనమాట నెగ్గించుకోవడానికి వాళ్ళను అవమానంచేసిన సైములుకూడావున్నాయి. పోలీసులనుపిలిపించి దాడిచేసినవిషయ వుంది. గుంతకల్‌లో మ్యునిసిపల్ ఎన్నికలు జరుగుతాయిఅనగా యీవేళ ఒకఆసామీమీద కొందరుభూస్వాముల ప్రోద్బలంతో దౌర్జన్యంచేయడానికి ఇదిఒక ఆయుధంలా వుపయోగించింది. ఇక opium విషయం ఆలోచిద్దాం. మొన్న నేను తెనాలితాలూకాలో పర్యటిస్తూండగా ఒక ముసలాయన నాతో చెప్పుకున్నాడు తప్పోఒప్పో నాకు ఇది అలవాటైంది. నాకు 75 ఏండ్లువచ్చాయి యీమూడుసంవత్సరాలుగా opium permit వచ్చింది. ఇప్పుడు యేదో ఆర్థిక ఇబ్బందులవల్ల లైసెన్సుడబ్బు కట్టలేకపోయినాను. అందుచేత పర్మిట్టుఇవ్వలేదని చెప్పుతున్నాడు. యేమైనా కేసులు మేము తీసుకువచ్చినా ప్రభుత్వం చర్యతీసుకుంటుందని మాకు నమ్మకంయెక్కడ? లంచాలను ఎంకరేజి చేసేకి వుపయోగపడే చట్టాలను తెచ్చి ప్రజలమీదరుద్దడం జరుగుతున్నది. కాని యీ ప్రొహిబిషన్‌ను తీసివేసినందువల్ల వచ్చేడబ్బు ప్రజలయొక్క ఆర్థికస్థోమతను పెంచడానికిగాను వెనుకబడినప్రదేశంలో ప్రాజెక్టులనిర్మాణానికి కాలవలనిర్మాణానికి వుపయోగపడుతుందని గుర్తించకుండా దీన్ని అమలుపరచడానికి మనం ప్రయత్నించకూడదని నేను అనుకుంటున్నాను. ఇది సహృదయంతో పెట్టినదికాదు. ఇప్పటి రాజకీయసంక్షోభాన్ని యెదుర్కోడానికి చేసినపనిఇది. ఒకటిన్నర నెలలలో ఒకరిపోర్టు వస్తుందన్నారు. కర్నూలులోకూర్చొని ఒకటిన్నర నెలల్లో యెటువంటిరిపోర్టు వస్తుందో నాకు తెలియదా? యీవిధంగా రాజకీయప్రతిష్టంభననుంచి తప్పుకుందామని చేసినపన్నుగడమాత్రమేఅని, దీన్ని జాగ్రత్తగాపరిశీలించాలనికోరుతున్నాను. యీలంచగొండితనాన్ని పెంచినచట్టం, పేదలమీద పన్నులు పెంచినచట్టం, దీనివల్ల ప్రజలకు జరుగుతున్న మేలుకంటే దీనివల్ల జరుగుతున్న కీడే యెక్కువని నేను మనవిచేస్తున్నాను. యీ కట్ మోషన్‌కు అనుకూలంగా ఓటుచేయమని మీఅందరిని కోరుతున్నాను.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO—అధ్యక్షమహాశయా, ఈతీర్మానంపైన ఈ Cut motion విషయంలో వుభయత్రా ఇంతవరకు 17-గురు గౌరవసభ్యులు మాట్లాడారు. వారుచేసిన సూచనలన్నీ నేను సావకాశంగా విన్నాను. వారికి నా హృదయపూర్వక అభినందనలు. యెందుకంటే, జిల్లాలలో జరుగుతున్న విషయములు, జరగబోయే విషయములు కూడా సమగ్రంగా చర్చించి చెప్పారు, మొట్టమొదట నేను యీ

demand ను ప్రవేశపెట్టినప్పుడే నాయొక్క అభిప్రాయములు ప్రభుత్వముయొక్క అభిప్రాయములను మనవిచేశాను. అనుమానాలతో, సందేహాలతో చాలామంది దీనిని గురించి చర్చించారు. నాకు సాధ్యమైనంతవరకు, సందేహాలు, అనుమానాలు లేకుండానే న్యాయం చేయాలనే వుద్దేశ్యంతో నేను మొదటినుంచి చెప్పాను. ఇప్పుడుకూడ దానిని నేను పునరుద్ఘాటిస్తూ మనవిచేస్తున్నాను. శ్రీ గారపాటి సత్యనారాయణగారు మాట్లాడుతూ యీCommittee ని వేయడము కళ్లనీళ్లు తుడవడానికే. యీ Committee ని వేస్తూ, tour ఖర్చులు యివ్వడానికి చూస్తున్నారని అంటున్నారు. యీ Committee అవసరము లేదని సెలవిచ్చారు. వుమ్మడి మద్రాసురాష్ట్రంలో వున్నపుడు యీ Committee ని వేయమంటే యెవ్వరూ వొప్పుకోలేదు. యీనాడు అది ఒక subject క్రిందకు తెచ్చారు. ఒక అత్యంత ముఖ్యమైన రాజకీయాలకు అతీతమైన ఒక Committeeని వేస్తే బాగుంటుందని సెలవిచ్చారు. నేను ఆవిషయాన్ని ముందుగానే మనవిచేశాను. యీ విషయంలో చాలా వాదోపవాదములు వున్నవి. కొందరు యీ మద్యపాననిషేధ చట్టము సక్రమముగా అమలుజరుపబడలేదు కాబట్టి యిది ప్రజలకు యేవిధంగాను లాభదాయకము కాదనే అభిప్రాయములను వెలిబుచ్చారు. మరికొందరు యీ చట్టము అమలులో వున్నది కాబట్టి యిది పేద ప్రజలకు లాభం చేస్తుంది, కాని దీనిని ప్రోహిబిషను వుద్యోగులు సరిగా నడపుటలేదనే అభిప్రాయములను తెల్పియున్నారు. అందువల్ల యిప్పుడు ఒక Committee ని వేశాము. ఆ Committee వేసినతరువాత వారు అభిప్రాయములు ఇచ్చిన తరువాత, వాటిని మీ యెదుట పెడతాను. దానిని గురించి యేమిచేస్తే బాగుంటుందో అప్పుడు ఆలోచించుకోవచ్చునని మీకు నేను సవినయంగా మనవిచేస్తున్నాను. ఆ విషయము మీకు ఇదివరకే చెప్పివున్నాను. తిరిగి నేను దానివిషయం చెప్పుచున్నాను. రాజకీయాలకు అతీతమైనవారిని కమిటీలో వేశాము. వారికి యేవిధమైన prejudices గాని, Differences గాని యేమీ లేవు. వారు పెద్దలు, అనుభవజ్ఞులు, ఇవన్నీ మీరు నమ్మండి. వారి అభిప్రాయములను మనము విందాము. వారికి చాల విశాలంగా references యిచ్చాము. వారు ఆంధ్రరాష్ట్రములోని అన్ని ప్రాంతాలలో పర్యటించి, ప్రజాభిప్రాయములను తెలుసుకొని,

అక్కడవున్న పరిస్థితులను సాకల్యంగా పరిశీలించి, విచారణచేసి report ను యివ్వవలసిందిగా కోరియున్నాము. ఆకమిటీవారు నిష్పక్షపాతమైన విచారణ సల్పి సక్రమమైన, సరియైన అభిప్రాయాలను తెలిపెదరో లేదో అనే అభిప్రాయాన్ని శ్రీనాగిరెడ్డి గారు వెలిబుచ్చారు. వారావిధంగా విమర్శించినందులకు నాకు చాలా విచారకరంగా వున్నది. ఆ కమిటీలోని వారి యొక్క అనుభవము నాకు బాగా తెలుసు. వారు చాలా అనుభవము గలవారు, గౌరవస్థులు, వున్నతోద్యోగాలలో వున్నారని నేను మనవిచేశాను. అటువంటివారి విషయములో గౌరవసభ్యులు అనుమానమును వెలిబుచ్చుట చాలా విచారకరం. వారు సమర్పించే నివేదిక సరిగా లేకపోతే, అప్పుడిస్తాము ఏమి చేయుననో మన మాలోచించుకోవచ్చు. కమిటీవారి రిపోర్టు యేవిధంగా వుంటుందో అనే అనుమానము యిప్పుడు యెందుకు? వారి రిపోర్టురాగానే మీముందు పెట్టుతానని చెప్పుతున్నానుగదా! ముందుగానే అటువంటి అనుమానాలు పెట్టుకోవద్దని గౌరవ సభ్యులకు మనవిచేస్తున్నాను.

తరువాత, కమిటీలో గౌరవసభ్యులను యెవ్వరినీ వేయలేదని, ప్రజాప్రతినిధులను కూడ వేయలేదని చెప్పారు. వారియందు నాకు మర్యాదలేదనికాదు, వారియందు నమ్మకము లేదనికాదు. ఆ కమిటీయొక్క ఆశయములు వివరిస్తూ ప్రతిపక్ష సభ్యులు యింత వరకూ యెన్నో కమిటీలు వచ్చాయి, పోయాయి అని అంటూ వచ్చారు. వాటినిగురించి నాకు ముఖ్యంగా యేమీ తెలియదు కాని, వారియందు అభిమానము వుండీకాదు, మీయందు అగౌరవము వుండీకాదు యీ కమిటీని నియమించినది. గౌరవసభ్యుల అందరి అభిప్రాయాలు తెలియజేయడానికి అవకాశము వుంది. కాబట్టి అటువంటి anomoly యేమీ పెట్టుకోవద్దు. అటువంటి anomoly తో యీ కమిటీని వేయడంలేదు.

కొంతమంది గౌరవసభ్యులు Sub-Inspectors అభిప్రాయాలు యీ విషయంలో అవసరం లేదనిన్ని, వారిలో లంచగొండి తనము హెచ్చుగా వుంటుందనిన్ని, చెప్పారు. Sub-inspectors లో చాలామంది అవినీతి పరులని అంటున్నప్పుడు, అటువంటి విషయములు నా దృష్టికి తెచ్చినట్లైతే, నేను అందులో వున్న న్యాయాన్యాయ విచారణచేసి న్యాయమే జరుపుతానని మీకు నేను హామీ యిస్తున్నాను. ఆ విషయ

ములో యెలాంటి అనుమానాలు పెట్టుకోవద్దని మనవి చేస్తున్నాను. కొంతమంది నల్లమందు విషయములో కూడా కష్టాలు వున్నవని చెప్పారు. దీని విషయములో చర్య తీసుకుంటాను. కమిటీ రిపోర్టు ప్రకారం 25% చొప్పున తగ్గించాలని అన్నారు. పోయిన సంవత్సరం మాత్రం చేరవలసిన విధంగా order pass చేశాను. అది అమలులోవుంది. అది గత ప్రభుత్వమువారు వేసిన ఆర్డరు. యీ ప్రభుత్వం దాన్ని గురించి యే విధంగా తగ్గిస్తే ప్రజలకు వుపయోగమో, ఆవిధంగా నేను ఆర్డరు యిచ్చాను. అంటే D. M. O. వద్దనుంచి Certificateఅక్కర లేకుండా Civil Surgeon వద్దనుంచి Certificate తీసుకుంటే చాలునని చెప్పాను. వీరన్నపడాల్‌గారు నాకు ఒక వుత్తరము వ్రాశారు. దాన్ని విచారించవలసిందని చెప్పాను. కాబట్టి కమిటీ రిపోర్టు వచ్చిన తరువాత, పరిశీలించి యేమిచేయవచ్చునో తేల్చుకో వచ్చును. అందువల్ల యీ డిమాండును పాసు చేయమని అడుగుతున్నాను. కాని దాన్ని మార్పుచేయమని అడుగడములేదు. ఇతర సభ్యులు కొందరు చాలా వ్యక్తిగతంగా మాట్లాడారు. అంతా యెక్కువ చెప్పడంకాదు. కొంతమంది సభ్యులు, నేను C. Rajagopalachari గారి శిష్యుడుననిన్ని, వారిమాదిరిగానే ముందుగా యేవిషయమును చెప్పకుండా అంతయు చేసిన తరువాత సభ్యులకు చెప్పుతారు, అదే మాదిరిగా యీ కమిటీ వేయడమనేది, సభ్యులకు తెలియకుండా వేసి, తరువాత పత్రికలలో ప్రచురించిన పిమ్మట సభ్యులకు తెలియజేశారు కాబట్టి, నేను రాజగోపాలాచారిగారి అడుగుజాడలలోనే యింకను యీ ప్రభుత్వము మంత్రివర్గములో చేరిన తరువాతకూడా, అదే ప్రకారము, నడచుచున్నానని నన్ను సభ్యులు వ్యాఖ్యానించి మాట్లాడారు. దీనికి నేను ఆవిధంగా నడవడములేదు. అందుకని నామీద అపోహ పడనక్కరలేదని సభ్యులకు తెలియ జేస్తున్నాను. అయితే నేను వారి శిష్యుడను అయితే కావచ్చు, కాని వారుచేసే విధముగా నేను యిక్కడ నడవడము లేదని సభ్యులను నమ్మమని విన్నవిస్తున్నాను. కాబట్టి ఈ కమిటీని నియమించే విషయములో సభ్యులయెడ నాకు పూర్తి గౌరవము వున్నదిగాని, అగౌరవము యేమియు లేదని నేను వారికి హృదయ పూర్వకంగా మనవి చేస్తున్నాను.

అధ్యక్షమహాశయా, నేను [illegible] సభ్యులు




# INDEX TO ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES

FIRST SESSION OF THE FIRST LEGISLATIVE ASSEMBLY UNDER THE CONSTITUTION OF INDIA AFTER THE FORMATION OF THE ANDHRA STATE

1954

7TH, 8TH, 9TH AND 11TH JANUARY 1954

Volume III—Nos. I to IV.

PRINTED BY THE SUPERINTENDENT
GOVERNMENT



# INDEX TO ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES.

FIRST SESSION OF THE FIRST LEGISLATIVE ASSEMBLY UNDER THE CONSTITUTION OF INDIA AFTER THE FORMATION OF THE ANDHRA STATE.

## Volume III—Nos. I to IV.

*7th, 8th, 9th and 11th January* 1954.

TABLE OF CONTENTS.

*Thursday, 7th January* 1954.



*Friday, 8th January* 1954.

*Saturday, 9th January* 1954.



*Monday,* 11*th January* 1954.

# INDEX TO ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES.

FIRST SESSION OF THE FIRST LEGISLATIVE ASSEMBLY UNDER THE CONSTITUTION OF INDIA AFTER THE FORMATION OF THE ANDHRA STATE.

## Volume III—Nos. I to IV.

PAGES.

C—*cont.*



D

PAGES.

D—*cont.*

PAGES.

G—*cont.*



H

PAGES.

H—*cont.*

PAGE

K—*cont.*



L

PAGES.

N—*cont.*

PAGES.

## P

PAGES.

P—*cont.*



Q

PAGES

Q—*cont.*



R

R—*cont.*

PAGES.



S

PAGES.

S—*cont.*

PAGES.

S—*cont.*



T



V

PAGES.

V—*cont*




# ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

THURSDAY, 7th JANURAY 1954

**VOLUME III — No. 1**

# ANDHRA LEGISLATIVE ASSEMBLY

**Thursday, 7th January 1954**

The House met in the Assembly Chamber, Kurnool, at Nine of the Clock, Mr. Speaker (The Hon. Sri N. Venkatramaiya) in the Chair.

---

*Point of order re: Cut motions*

SRI S. VEMAYYA, on a point of order, Sir నిన్నటి దినము రివెన్యూ డిమాండు పాస్ అయినట్లుగా అధ్యక్షులవారు సెల విచ్చారు. కాని మిగిలిన Cut motions కొన్ని అలాగే ఉండి పోయినవి. అవి Withdraw చేసుకొనడం గాని, వోటుకు పెట్టడం గాని జరగలేదు. అటువంటప్పుడు ఆ డిమాండు పాస్ అయినట్లుగా భావించడమేలాగని నాకు సందేహంగా ఉన్నది. కనుక ఈ విషయంలో అధ్యక్షులవారు రూలింగు ఇవ్వాలి.

Mr. Speaker :—నిన్ననే రూలింగు యిచ్చాను.

## I.—QUESTIONS AND ANSWERS

*Starred questions and Answers*

*40-A.

Q.— SRI M. VEERABHADRAM :— Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) whether the Government sent proposals delimiting the Assembly constituencies in the State to the Delimitation Commission;

(b) if so, whether the proposals were drafted by this Government or the composite Madras State Government; and

(c) whether the Collectors of the districts were consulted in the matter?

THE HON. SRI N. SANJEEVA REDDI :— (a) and (b) Proposals delimiting the Assembly constituencies in the State were drafted and sent to the Delimitation Commission by the Chief Electoral Officer of the composite Madras State before the formation of the Andhra State. The proposals are in the nature of office proposals and not those of the Government of the composite State.

(c) Yes Sir.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Composite State లో ఉన్నటువంటి Chief Electoral Officer పంపించినటువంటి proposals ఈ గవర్నమెంటు తిరిగి పరిశీలించి ఈ గవర్నమెంటుయొక్క అభిప్రాయమునుగూడ దానిమీద తెలియజేస్తారా? ఆ సందర్భంలో దానిమీద శాసనసభ్యులయొక్క అభిప్రాయములనుగూడ తీసుకొని ఆ విధంగా ఈ ప్రభుత్వముయొక్క అభిప్రాయాన్ని తెలియ జేయడానికి పూనుకొంటారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— Chief Electoral Officer చేసిన proposals ప్రభుత్వము ఇంకాను పరిశీలించలేదు. అవి Delimitation Committee కి పోయి వారు వాటిని announce చేసిన తరువాత ప్రభుత్వము పరిశీలించడానికి వీలు అవుతుంది.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Composite State కు సంబంధించిన టువంటి Chief Electoral Officer, ఆ proposals పంపించారు, గాని మన ప్రభుత్వంవారు appoint చేసినటువంటి Chief Electoral Officer పంపించలేదు. అలాంటప్పుడు ఆ Composite State యొక్క Chief Electoral Officer అక్కడ recommend చేసినవి publish అయిన తరువాత మన ప్రభుత్వం మన అభిప్రాయాన్ని తెలియజేయుడమనేది సరిగాలేదు. అలా కాకుండా Composite State విభజన అయిన తరువాత ఇక్కడ మళ్ళీ ఈ ప్రభుత్వము, appoint చేసినటువంటి Chief Electoral Officer proposals చేసి, వాటిమీద ఈ ప్రభుత్వము యొక్క అభిప్రాయాన్ని ఇవ్వవలసి యుంటుందని కేంద్రప్రభుత్వమునకు తెలియజేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— మీరు చెప్పిందంతా జ్ఞాపకం లేదనుకొండి. అయినా సమాధానం చెప్పు తున్నాను. ఇక్కడ ఒక రాష్ట్రం ప్రత్యేకంగా ఏర్పడిందని, కనుక ఈ ప్రభుత్వము యొక్క అభిప్రాయాన్ని కూడ తీసుకోవా లని వెంటనే ఢిల్లీకి తెలియజేశాము.

SRI C. V. K. RAO :— ఈ proposals యొక్క కాపీలు గవర్నమెంటు పార్టీలో ఉన్నటువంటి ప్రతినిధులకు కొంతమందికి అంద జేశారనే వదంతి ఉన్నది. ఆవిధంగా జరిగిందంటే తమకు అనుకూలంగా Constituencies సృష్టించుకోవడానికి చేసినట్లుగా కన్పిస్తున్నది కనుక

ఈ proposals యొక్క కాపీలు ఈ శాసనసభ సమావేశము పూర్తి అయ్యేలోగా, అందరికి అందజేయడానికి పూనుకొంటారా, లేదా? ఎందుచేతనంటే, ఇప్పుడు ఆ కాపీలు కొద్దిమంది శాసన సభ్యులకు మాత్రం యివ్వడం జరిగింది.

THE HON. SRI N. SANJEEVA REDDI :— కొంత మంది మద్రాసు ప్రభుత్వములోనుంచి వాటిని సంపాదించుకొని వుంటారు. C V. K. రావుగారుకూడ ఆ విధంగా సంపాదించుకోవచ్చు.

SRI C. V. K. RAO :— అదే నా ప్రయత్నము. వాటిని ప్రభుత్వమే అందజేయవలసిందని కోరుతున్నాను. కనుక దయచేసి ఇస్తారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— అవి ఢిల్లీలో ఉన్నాయి. కావలసినవారు అక్కడికి వెళ్ళి తీసుకొనవచ్చును.

SRI P. PUNDARIKAKSHACHARYULU :—ఈవిషయంలో కలెక్టర్లను consult చేశామని అన్నారు. వారు దానిమీద ఏమో స్తరుగా proposals చేయవలెనో ఏమైనా definite instructions ఇచ్చారా?

THE HON. SRI N. SANJEEVA REDDI :— మద్రాసు ప్రభుత్వంవారు అవి చేశారని అప్పుడే చెప్పాను. ఉన్న చట్టం ప్రకారం కలెక్టర్లకు instructions ఇచ్చి ఉంటారు. అవి ఏ రకంగా ఇచ్చింది తెలియదు. ఎందుకంటే, అవి మద్రాసు ప్రభుత్వము చేసింది గాని ఆంధ్రప్రభుత్వము చేసిందికాదు.

SRI K. VENKIAH :— ఈ proposals ను ఢిల్లీకి గాని, మద్రాసుకుగాని వెళ్ళి తీసుకోవలసిందని అంటున్నారు. అయితే ఈ proposals మన ప్రభుత్వమునకు తెలియజేయకనే వెళ్ళాయా? తెలిసుంటే, వాటిని ఇవ్వడానికి ఏమి అభ్యంతరమున్నది?

THE HON. SRI N. SANJEEVA REDDI:- అవి ప్రభుత్వానికి పంపబడలేదు. అవి మా ఆలోచనలో కూడ లేవు. ఢిల్లీలోని Delimitation Committee వారు వాటిని publish చేసిన తరువాతనే, ప్రభుత్వమునకు [illegible] వీలు అవుతుంది. ఆ proposals [illegible] ప్రభుత్వము క్రింద వున్నటువంటి ఉద్యోగస్థులు [illegible]

SRI PRAGADA KOTAYYA:— ఈ నియోజకవర్గాల పునర్విభజన ప్రతిపాదనలు మదరాసు ప్రభుత్వం Election Commissioner నుంచి ఇండియా ప్రభుత్వానికి వెళ్ళినప్పుడు ఆంధ్రకు సంబంధించిన రికార్డులు ఆంధ్రప్రభుత్వానికి పంపారంటారా ? లేదంటారా ?

TEH HON. SRI N. SANJEEVA REDDI:— Record రాలేదని, అందువల్ల protest చేశాము. అక్కడవున్న ఉద్యోగులుకూడా choice కావాలన్నారు.

SRI B. SANKARAYYA:—కాన్స్టిట్యుయన్సీలు చీల్చడం ఏ ప్రాతిపదికపైన చేశారు ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఆ విషయం మీకుకూడా తెలుసునన్నమాట.

SRI VAVILALA GOPALA KRISHNAYYA:— కలెక్టరు గవర్నరుక్రింద ఉన్నారనుకుంటాను. కలెక్టరు దగ్గర కాపీలున్నాయి. ఈ చిక్కులు లేకుండా కాపీలు అందరకూ అందజేసే పద్ధతి చేస్తారా? సంజీవరెడ్డిగారు Central Government కు మనకలెక్టరు ద్వారా ఇంప్పిచారా ? అలాంటి insinuation చేయుడం సబబుకాదు.

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఇందులో insinuation ఏమీ లేదండి.

SRI M. VEERABHADRAM:— Collector propose చేసిన scheme కు ఇప్పుడు Election Commission propose చేసినదానికీ తేడా వున్నదా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఇప్పుడున్న scheme, Election Commission propose చేసినదే. నేను కలెక్టరు చేసిన proposals చూడలేదు.

SRI K. SUBBA REDDI:— ఈ proposals పరిశీలించి ఇప్పటికైనా ప్రభుత్వం నిర్ణయం తీసుకుంటారా ? లేక రహస్యంగా వుంచుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— అది నాకే తెలియకుండా రహస్యంగా వున్నది. మీ వరకూ ఎక్కడ వస్తుంది.

SRI M. SUBBA REDDI :—Retire అయ్యే Collector చేసే proposals క్రొత్త కలక్టరు వచ్చిన తరువాత మారుస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—Collector propose చేసే stage దాటిపోయింది. మరల Collector దగ్గరకు పోదు.

SRI M. VEERABHADRAM:— Proposals రహస్యంగా ఉన్నాయంటున్నారు. అవి non-official గా circulate చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:— ఆ విషయం ఇప్పుడు arise కాదండి.

SRI P. PUNDARIKAKASHACARYAULU :— Composite State Electoral officials, Delimitation Committee కి పంపించారన్నారు. Delimitation, Committee కి పంపుటకు Andhra State లో Electoral officials ఉన్నారా ? దీన్ని తిరిగి పరిశీలించి proposals చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :— ఈ ప్రభుత్వ electoral officials కు voice ఉండాలనే, మమ్మల్ని consult చేయాలని ఢిల్లీప్రభుత్వానికి సూచించాము.

SRI V. SRIKRISANA :— ఇప్పుడు మంత్రివర్గంలో యున్న కొంతమంది అప్పుడు Composite Cabinet లో ఉన్నారుగదా వారికికూడా తెలియదా ?

THE HON. SRI N. SANJEEVAREDDI :— మంత్రులకు తెలియదు. మంత్రులను consult చేయరు.

*Change of Capital*

* 41. Q.-SRI M. NARAYANASWAMY : Will the Hon. the Chief Minister be pleased to state whether the Government are considering to change the seat of Capital of Andhra State ?

THE HON. SRI T. PRAKASAM :—The answer is in the negative. Capital మార్చే ఉద్దేశ్యం గవర్నమెంటుకు ఎంతమాత్రం లేదు.

SRI K. MALAKONDAYYA :—ప్రభుత్వానికి Capital మార్చే ఉద్దేశ్యం లేదని చెబుతున్నారు. గత ఆంధ్ర అసెంబ్లీ సమావేశంలో విశ్వనాథం పంతులుగారు ఆరు నెలలులోనో, సంవత్సరం లోనో మారిస్తే బాగుంటుందన్నారు. ఈ భేదాభిప్రాయం ఎందుకు వచ్చిందండి ?

THE HON. SRI T. PRAKASAM :—విశ్వనాథంగారు వారికి తోచినట్లు వారు చెప్పారు. ఈ వేళ నేను కూడా చెప్పవచ్చు ఇంకో మోస్తరుగా. ఇదివరకు చెప్పినదాని కంటె ఇప్పుడు చెప్పినదానికంటె కూడా వేరే చెప్పవచ్చు.

SRI C. V. K. RAO :—Capital మారకపోతే, మంత్రివర్గం మారుతుంది. అది జరగకుండా Capital మారుస్తారా ?

THE HON. SRI T. PRAKASAM :— ఈ విషయము ఈ విధంగా Question లలో తీసుకురాకూడదు. మార్పులువస్తే మారుతాయి. దాన్నిగురించి Question లు వేసి ఇట్లా చేస్తారా, అట్లా చేస్తారా అని అడగకూడదు.

SRI P. PUNDURIKAKSHACHARYULU:— Capital మార్చే ఉద్దేశ్యం ప్రభుత్వానికి లేదన్నారు. ఇది temporary కేపిటలు విషయంలోనా లేక పెర్మనెంటు కేపిటలువిషయంలోనా?

THE HON. SRI T. PRAKASAM :— ఏదికాదు.

SRI T. NAGI REDDI:— మంత్రివర్గం మొన్న రాజధాని సమస్యగురించి చర్చించినప్పుడు ఒక ప్రకటనగాక రెండు ప్రకటనలు చేసింది. ఇప్పుడు ప్రకాశం పంతులుగారు Capital మార్చే ఉద్దేశ్యం లేదన్నారు. అసెంబ్లీలో చేసే ప్రకటనలకూ, బైటచేసే ఉపన్యాసాలకూ, ప్రకటనలకూ, ఈనాడు ఈ అసెంబ్లీలో చేసే ప్రకటనలకూ భేదం చూచారు. చూచిఉంటే ఈ భేదం లేకుండా ఒకవిధమైన statement ఖచ్చితంగా ఇచ్చే ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI T. PRAKASAM :— ఈ భేదాలు ఏ నిముషానికి ఆనిముషం, ఏ రెప్పపాటు కాలానికి, ఇంకో రెప్పపాటు కాలంలో వస్తూనేఉన్నాయి. నేను కూడా ఆలోచిస్తూనేవున్నాను. నాగిరెడ్డిగారు ప్రత్యేకంగా అడిగారు. నాగిరెడ్డిగారే కాకుండా ఇతర స్నేహితులుకూడా ప్రైవేటుగా అడిగారు. నేనూ ఆలోచిస్తున్నాను. అందుకే ఇప్పుడు చెప్పే జవాబుకు జాగ్రతగా ఆలోచిస్తే ఇంకా కొంచెంసేపటికి ఎట్లా జవాబుచెబుతానో నాకే తెలియదు అన్నాను. ఇక్కడ ఉండే మెంబర్లు cut motions ఇచ్చి వారు మాట్లాడకుండా ఊరుకొని ఉంటే వచ్చే బడ్జటు సమావేశంలో statement ఇచ్చుటకు అవకాశం వస్తుంది. అప్పుడు చేస్తాము. దానికి అభ్యంతరంలేదు.

SRI T. NAGI REDDI .-అధ్యక్షా! ఇప్పుడు ఇంకో statement వచ్చింది. ఈ statement ను బట్టిచూస్తే వచ్చే బడ్జటులో మరొక statement చేస్తామని ముఖ్యమంత్రిగారు చెబుతున్నారు. అంటే అర్థం, వచ్చేబడ్జటులో చేసే statement ఇంతవరకు చేసిన statement లకు భిన్నంగా ఉంటుందనా? లేక వాటికి దగ్గర దగ్గరలో ఉంటుందా ?

THE HON SRI T. PRAKASAM .—అప్పటి సంగతులను బట్టి వాటికి అనుకూలంగా ఉండేటట్టుగా ఉంటుంది.

*Regulator-Cum-Bridge over krishna River*

* 42. Q — SRI KOLLA VENKAIAH :— Will the Hon. The Deputy Chief Minister be pleased to state:

(a) Whether the State Government have submitted any scheme for the construction of Regulator-cum-Bridge over Krishna River in place of present Krishna Anicut, to Government of India;

(b) Whether any reply has been received from the Government of India;

(c) When the scheme was submitted; and

(d) Whether a copy of Scheme and reply will be placed on the Table of the House?

Sri K. VENKAYYA.— మంత్రిగారు information ఎక్కడసంపాదించారు అంటున్నారు. ఆస్కీములోవున్న కాలపరిమితి ఎంతో చెబుతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI— రోడ్డు మొదలైనవి అన్ని వేయడానికి పట్టేకాలాన్ని మినహాయించి రెగ్యులేటరు బ్రిడ్జి నిర్మాణానికి 2½ సంవత్సరాలుమాత్రమే పడుతుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU-వారు ఇచ్చిన రిపోర్టు పూర్తికాపీఇవ్వడానికి ఖర్చు ఎక్కువయితే ముఖ్యమైన విషయాలనుమాత్రమే కుదించి సభ్యులకు ఇవ్వడానికి పూనుకుంటారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI—ఆలోచించబడును.

Sri VAVILALA GOPALA KRISHNAYYA — మంత్రిగారు అంకెలు చెప్పనవసరం లేదన్నారు. అవి రహస్యమైనవా ?

The Hon. Sri. N. SANJEEVA REDDI— ప్రతిఫలంకన్న ఖర్చు ఎక్కువఅని చెప్పాను.

Sri PRAGADA KOTAYYA :—రెగ్యులేటరు బ్రిడ్జి నిర్మాణం వల్ల అదనంగా ఆయకట్టులో చేరే భూమి ఎంత వుంటుంది ?

The Hon. Sri N. SANJEEVA REDDI:-లక్ష ఎకరాలు.

Sri M. VEERABHADRAM :— పోనీ ఆ రిపోర్టుకాపీ ఒకటి సభవారిఎదుట ప్రవేశపెడతారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI;— దాని విషయం కూడా ఆలోచిస్తాము.

Sri S. VEERAYYA:—మంత్రిగారు చెప్పడంలో April లో estimates submit చేస్తామన్నారు. తరువాత revised estimates వచ్చినట్లు విన్నాము. మొదటిదానికి రెండవదానికి ఏమైనా deviation వున్నదా ?

The Hon. Sri N. SANJEEVA REDDI— అట్టి విషయాలలో తేడా లేదు కాని technical గా కొన్ని భేదాలు

వచ్చాయి. వారు ఇచ్చిన సలహాలు పని ముఖ్యమైనది కాబట్టి అంగీకరించాము.

Sri C. SUBBARAYUDU— రిగ్యులేటరు బ్రిడ్జి ప్రోగ్రాం వల్ల అదనపు ఆయకట్టు వుండదని వెనుక చెప్పిన సంగతి మంత్రిగారికి తెలుసా ?

The Hon. Sri N. SANJEEVA REDDI— అప్పుడు చెప్పినదికాదు. ఇపుడు వున్న విషయం చెబుతున్నాను.

Sri P. PUNDARIKAKSHACHARYULU— రెండు పంటలు సాగు అవడానికి ఏమాత్రం ఆయకట్టు వుంటుంది ?

The Hon. Sri N. SANJEEVA REDDI—Notice.

*Talamarla Weavers, Co-operative Society.*

* 43. Q.-Sri T. LAKSHMINARAYANA REDDI — Will the Hon. the Minister for Revenue be pleased to state:

(a) whether Talamarla Weavers' Co-operative Society in Penukonda taluk applied for a site for the installation of wharping wheel and for locating office on 14-9-51.

(b) whether it is a fact that the District Collector, Anantapur directed the Tahsildar, Penukonda to evict the encroachments and place the site at the disposal of the Society in his proceedidgs L. Dis. No. 2010/53-A4/ 31-1-53 and 11383/53-A4 dated 18-6-53; and

(c) if so, what action has been taken thereon ?

The Hon. Sri K. KOTI REDDI :—

(a) yes.

(b) and (c) In his proceedings L. Dis. No. 2010/53-A4/31-1-53 and L.Dis. No.11383/53-A4, dated 18-6-1953 the Collector of Anantapur informed the President, Talamarla Weavers' Co-operative Society that the question of placing the lands at the disposal of the society would be considered after evicting the squatters already encroaching on the site. Later, after

an inspection of the site, the Sub-Collecter, Penukonda, reported that it was not suitable for the installation of a wharping wheel being situated in the midst of dwelling houses. The Collector has therefore asked the Society to select some other suitable site and renew its application.

Sri PRAGADA KOTAYYA :— ఇలాంటి సహకార సంఘాలకు వాటి భవననిర్మాణానికి ఉచితంగా స్థలాలుఇచ్చే విధానాన్ని ప్రభుత్వం అంగీకరిస్తుందా ?

The Hon. Sri K. KOTI REDDI :— ఆలోచిస్తాము.

Sri T. LAKSHMINARAYANA REDDI:— ఆ స్థలం సరిగ్గామైనదన్న విషయం ఉద్యోగస్థులు కూడా ఒప్పుకున్నారు. తిరిగి ఈ విషయంలో విచారించి ఆ సొసైటీకి తిరిగి ఇప్పించడానికి ప్రయత్నం చేస్తారా ?

The Hon. Sri K. KOTI REDDI:— కలెక్టరుగారు సబ్ కలెక్టరునుపోయి ఆ site ను చూసి report చేయమన్నారు. సబ్ కలెక్టరు ఆ site అనుకూలంగా లేదని చుట్టు ప్రక్కల ఇళ్ళు వున్నాయని చేసిన రిపోర్టుపైన కలెక్టరుగారు ఉత్తరువులు చేశారు.

Sri D. DASARADHARAMAYYA:—ఇటువంటి విషయాలలో కలెక్టర్లు ఇచ్చే అభిప్రాయాలు సంతృప్తిగా లేవని శాసనసభ్యులు చెప్పినపుడు మంత్రులు స్వయంగా ఆ స్థలాలను చూచి నిర్ధారణ చేసే అభిప్రాయం వున్నదా ?

The Hon. Sri K. KOTI REDDI.— మంత్రులు ప్రతిస్థలం చూడాలంటే 8 మందిమంత్రులు చాలరు. 20 మందివుండాలి. నేను నా డైరీలో ఫలానా ఫలానా చోటు చూడ్దాం అని అనుకున్నా ఆప్రకారం జరగడానికి వీలులేకుండావుంది. కొంతవరకు కలెక్టర్లు, సబ్ కలెక్టర్లు చెప్పేదానిపైనగూడా ఆధారపడవలసి వస్తుంది. ఉద్యోగస్థులు అంతగా తప్పుడుగావుంటే special [illegible] గా విచారించి అవసరమైతే చూస్తాము [illegible] [illegible]

Sri C. V. K. RAO— 20 మంది మంత్రిలు కావాలంటు న్నారు. దానికి తగినవారు ఆ side నుంచి ఎవరు దొరకలేదా ?

The Hon. Sri K. KOTI REDDI— (No reply)

Sri B. LAKSMI NARASARAJU-ఈవిషయంలో సభ్యులు ఇచ్చే సలహాఅయినా పాటిస్తారా ?

The Hon Sri K. KOTI REDDI ఇప్పుడు వున్న పరిస్థితుల్లో అన్నిపక్షాలవారు సలహాలు చెబుతూ నేవుంటారు. అన్ని స్థలాలు మంత్రులుచూడాలంటే, సాధ్యంకాదు. చాలా అన్యాయం జరిగిందంటే ఆలోచనచేస్తాము.

Sri PILLALAMARRI VENKATESWARLU — ఏవో కొన్నిస్థలాలు చూస్తామంటున్నారు. District Collectors ఇచ్చిన అభిప్రాయములపై తీవ్రమైన అభ్యంతరంవచ్చినపుడు వాటిని ప్రత్యేకంగా పరిష్కరించడానికి పూనుకొంటారా మంత్రులసంఖ్య హెచ్చించిఅయినా ?

Mr. SPEAKER—This is not a question.

*Purchase of Furniture for Andhra State Offices.*

* 44. Q.—Sri G. RAMA RAO — Will the Hon. The Minister for Finance be pleased to state:

(a) The amount spent for the purchase of furniture at Madras for the Andhra State Offices at Kurnool; and

(b) Whether it is a fact that the furniture purchased is over and above the requirements?

The Hon. Sri T. VISWANATHAM—

(a) A sum of Rs. 49,200/- was sanctioned by the Government of the Composite State for the purchase of furniture for Andhra State Offices at Kurnool.

(b) The answer is in the negative.

The Hon, Sri T. VISWANATHAM—(ఎ) ఆంధ్రాఫీసులలో కావలసిన furniture నిమిత్తం ఉమ్మడి ప్రభుత్వం

రు. 49,200/- మంజూరు చేశారు. (బి) హెచ్చుగా లేదు తక్కువగా కూడా వుంది.

Sri PILLALAMARRI VENKATESWARLU — ప్రశ్నకు సరైన సమాధానం రాలేదు. మద్రాసులో ఎంత ఖర్చు పెట్టారని మా ప్రశ్న.

The Hon. Sri T. VISWANATHAM— నేను చెప్పింది కూడా అంతేనండి. ఉమ్మడి రాష్ట్రమే దానికి ఖర్చుపెట్టింది. అవి కొనేటప్పటికి ఆంధ్ర ప్రభుత్వం ఇంకా యేర్పడలేదు. ఏర్పాట్లు చేసుకునేసందర్భంలో ఉమ్మడిరాష్ట్రండబ్బు మంజూరు చేయవలసివచ్చింది. మీకు తెలిసేందుకే ఆ వివరాలుచెప్పాను.

Sri B. RAMARAO— ఇవి స్వయంగా కొన్నారా లేక కాంట్రాక్టు పద్ధతిమీద కొన్నారా? ఏయే రకాలైన furniture కొన్నారు? Legislators' Hostel లో యిచ్చిన కుర్చీ, టేబిలు యొక్క మొత్తం ధర ఎంత?

The Hon. Sri T. VISWANATHAM — అసలు ప్రశ్నకు దీనికి సంబంధంలేదు. Legislators' Hostel Quarters లో వున్నవాటిని గురించి ప్రత్యేకంగా సమాధానం చెప్తాను. అసలుప్రశ్న ఆఫీసులకు సంబంధించినది. Furniture స్వయంగా పోయి కొనలేదు. Superintending Engineer గారు short notice టెండర్లు పిలిచి కావలసిన సామగ్రికి ఆర్డరు 9, 10 మంది కిచ్చారు. బాగా తక్కువ టెండర్లువేసిన వారితో ఖరీదు నిర్ణయించుకుని వారే కొన్నారు.

Sri B. RAMA RAO :— ఏయే రకాలైన సామానులు కొన్నారండీ?

The Hon. Sri T. VISWANATHAM :—బల్లలు, కుర్చీలు (నవ్వు)

Sri P. SYAMASUNDARA RAO-కొన్న furniture లో పాతసరుకు ఏమైనా వున్నదా? మరమ్మత్తుకు సిద్ధంగా వున్నసరుకు ఏమైనా వుందా?

The Hon. Sri T. VISWANATHAM :— అసలు ప్రశ్నకు ఇలాంటి ఉపప్రశ్న పుడుతుందని అనుకోలేదు. Firms నుంచి కొంటే పాతవి బాగుచేసుకో వలసినవి వుండవు. అన్నీ క్రొత్తవే.

Sri P. SYAMASUNDARA RAO : ఇక్కడ మరమ్మత్తు చేసినవి కొన్నవా లేక ఇతరులు మనకిచ్చినవా ?

The Hon. Sri T. VISWANATHAM :— కొనుక్కున్నవే కాక చెన్నరాష్ట్ర ప్రభుత్వం మనవాళ్ళకు ఇచ్చినవికూడా వున్నాయి. వాటిలో కొన్ని ప్రయాణంలో పోయి వుంటాయి. కొన్ని అక్కడే పోయి వుంటాయి. (నవ్వు) మనకు వచ్చినవి బాగుచేయించు కుంటున్నాము. బాగుచేయనష్టంటే, అట్లాగే వుంచుతాము.

Sri P. NARASIMHA REDDI:—Furniture మద్రాసులోనే కాకుండా కర్నూలులోకూడా కొనమని వారికి సలహా యివ్వలేదా ? ఒకవేళ యివ్వకపోతే ఇక్కడ దొరకదనుకుని యివ్వలేదా ? లేక ఆ విషయమే మీ మనసుకు తోచలేదా ?

The Hon. Sri T. VISWANATHAM :— అక్టోబరు 1 వ తేదీకి 1 వారం ముందుగానే ఇక్కడకు రావలసి వున్నందున మనకు Furniture తొందరలో కొనవలసి వచ్చింది. కర్నూలులోకూడా ప్రయత్నం చేశారు. ఇక్కడ దొరకలేదు. అందుచేత Superintending Engineer గారు అక్కడే వాటిని కొన్నారు.

*Field Labour Societies in Anantapur.*

* 45. Q.-Sri S. NARAYANAPPA—Will the Hon. the Minister for Planning and Public Health be pleased to state:

(a) the number of Field Labour Societies formed in Anantapur District;

(b) the extent of land under cultivation by each Society;

(c) the amount of financial help given to each Society and the categories under which it is given ;

(d) whether there are any representations for further organisation of Field Labour Societies in Anantapur District; and

(e) if so, the action taken thereon till now?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) Two Field Labourers'' Co-operetive Societies were formed in the Anantapur District, one at Kandukur in the Anantapur Taluk and the other at Vanavolu in the Hindupur Taluk.

(b) Both the Societies have applied to the Collector and the Tahsildars concerned for lease of Government lands and their applications are under the active consideration of the officers concerned.

(c) No financial help has, so for, been given to the two Societies. The Societies have not also sought any financial help either from the Central Bank or from the Government.

(d) & (e) Representations have been received by the Special Development Officer, Anantpur from the landless poor people of Gangampalli, (Hindupur Taluk), Gotlur (Dharmavaram Taluk), Dubbarapalli (Dharmavaram Taluk-, Ipperu (Anantapur Taluk), Pitchireddi Kottala (Dharmavaram Taluk), Talupula (Kadiri Taluk) and Venkatathimmapuram (Dharmavaram Taluk) for the organisation of Field Labourers' Co-operative Societies. The representation for the organisation of a Field Labourers Co-operative Society at Venkatathimmapuram was negatived as the Collector did not recommend the proposals. Necessary action is being taken by the Special Development Officer, Anantapur, on the other representations, in consultation with the Collector, the Tahsildars and the other officers concerned.

The Hon. Sri D. SANJIVAYYA— (a) అనంతపురం జిల్లాలో రెండు ఫీల్డు లేబరు కోఆపరేటివ్ సొసైటీలున్నాయి. ఒకటిఅనంతపురంతాలూకా కందుకూరులోను, రెండవది హిందూపురంతాలూకా వనవోలులో వుంది.

(b) ఈరెండుసొసైటీలు తమకు కొంతభూమిని leaseకు యివ్వమని అర్జీ పెట్టుకున్నారు. దానివిషయమై అక్కడి కలెక్టరుగారు, ఆయనక్రిందవున్న తహసీల్దారు వగైరాలు చూస్తున్నారు.

(c) వారికింతవరకు ఏలాటి ధనసహాయము ప్రభుత్వంగాని, సెంట్రల్ బ్యాంకువారుగాని చేయలేదు. అటువంటి సహాయంకోసం వారు అడగలేదు.

(d) & (e) అనేకచోట్లనుంచి దరఖాస్తులు వచ్చాయి. వాటి పేర్లు కూడా నేను చదివి వినిపించాను. అందులో ఒక్క వూరినుంచి వచ్చినదరఖాస్తునుమాత్రం కలెక్టరుగారు రికమండ్ చెయ్యలేదు.

Sri T. NAGI REDDI — గౌ. మంత్రిగారు (b) భాగానికి సమాధానం చెపుతూ ఆ రెండు గ్రామాలు కొంతభూమిని తమకివ్వమని అర్జీపెట్టుకున్నట్లూ, ఆ అర్జీ ఇంకా మంజూరుచేయాలా వద్దాఅని ప్రభుత్వ ఆలోచనలో వున్నట్లు చెప్పారు. ఆ అర్జీ ఎప్పుడు పెట్టుకున్నారు. ఆ సొసైటీని ఎప్పుడు నిర్మాణంచేసుకున్నారు. ఆ అర్జీలు ఎప్పుడు మంజూరు చెయ్యాలనుకుంటున్నారు?

The Hon Sri D. SANJIVAYYA— కందుకూరువారు 9-6-1951 తేదీని అర్జీ పెట్టుకున్నారు. అక్కడ కొన్ని చిక్కులున్నాయి. అక్కడవున్న భూమి దాదాపు య. 1,214.54 సెంట్లు. ఇందులో య. 769-47 సెంట్లను శివాజమా cultivation క్రింద 117 మంది ఆక్రమించి వ్యవసాయం చేసుకుంటున్నారు. ఈ ఆక్రమించుకున్న వారిలో భూవసతి లేనివాళ్ళు, హరిజనులు, ఇంకా కొందరు వున్నారు. వాళ్ళని భూములనుంచి తొలగించడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఆతర్వాతే ఆ భూమిని సొసైటీకి మంజూరుచేస్తాము.

Sri T. NAGI REDDI — తదితరులు అన్నవాళ్ళలో వ్యవసాయ కూలీలు, భూములులేనివాళ్ళు మాత్రమే వున్నారా లేక భూవసతి కలిగినవాళ్ళుకూడా వున్నారా?

The Hon. Sri D. SANJIVAYYA — దీనిలో భూములు లేనివాళ్లు, హరిజనులు, backward classes వారు, ఇతర కులాల రైతులుకూడా వున్నారు. ఇందులో ఇతరకులాల రైతులను తొలగించడానికి ప్రయత్నంచేస్తున్నాము.

Sri PRAGADA KOTAYYA — ఈ ఫీల్డు లేబర్ కో-ఆపరేటివ్ సొసైటీ నిర్మాణంచేయాలి అన్న ప్రశ్న వచ్చినప్పుడు ముందుగా భూములు మంజూరు అయిన తరువాతనే గాని రిజిస్ట్రారువారు రిజిస్టరు చేయమకదా. ఈ సొసైటీ రిజిస్టర్ అయిన తరువాత భూములకోసం ఎందుకు ప్రాధేయపడాలి ? ఈ విషయంలో ప్రభుత్వవిధానంలో ఏమైనా మార్పు వచ్చిందా ?

The Hon. Sri D. SANJIVAYYA—ఈవిషయమైమద్రాసు అసెంబ్లీలోకూడా శ్రీ కోటయ్యగారుచెప్పారు. దీనిలో చాలా చిక్కులున్నాయి. కొన్నిచోట్ల సొసైటీరిజిస్టరు అయితేనేగాని భూమి మంజూరుచెయ్యమని రెవిన్యూఅధికార్లు అంటున్నారు. మరికొన్నిచోట్ల కోఆపరేటివ్ డిపార్టుమెంటువారు, భూమిని ముందుగా మంజూరు చేయించుకుంటేగాని సొసైటీని రిజిస్టరు చేయము అంటున్నారు. ఈవిషయమై మేము రెవిన్యూబోర్డుకు refer చేశాము. రెవిన్యూబోర్డుఅధికార్లు, కోఆపరేటివ్ డిపార్టుమెంటువారు కూర్చుని ఒకనిర్ణయానికి రావాలని అడిగాము.

Sri G. LATCHANNA— ఈచిక్కును పరిష్కరించడానికిగాను ఏ యే తాలూకాలలో ఎంతెంతభూమి assignment చేయడానికి వీలుగావున్నది రెవిన్యూడిపార్టుమెంటు నిర్ణయిస్తే బాగుంటుందికదా ?

The Hon. Sri D. SANJIVAYYA — ఈప్రశ్న రెవిన్యూమంత్రిగారికి వెయ్యండి.

Sri S. NARAYANAPPA—అనంతపురంతాలూకాసిద్దలాంపురంలోకూడా ఇటువంటి కోఆపరేటివ్ సొసైటీలు స్థాపించడానికి ప్రయత్నంచేస్తారా ?

The Hon. Sri D. SANJIVAYYA — నేనాస్థలాన్ని చూశాను. కాని అది ఇంకా రిజిస్ట్రేషన్ స్టేజికి రాలేదు.

Sri A. VENKATARAMARAJU — భూములిస్తున్నారు కాబట్టా ! లేక వారు ఇతర కులాలవారు కాబట్టా ?

7th January 1954]

The Hon. Sri D. SANJIVAYYA :— సంఘాలకు సంబంధించిన నిబంధనలు కొన్ని ఉన్నాయి. కాని స్థూలంగా ఏమీ లేవు. వాటిని ఇక్కడపెట్ట డానికి వీలులేదు. Individual గా వస్తే చెబుతాను.

*Neera System*

* 46 Q.—Sri K. GOVINDA RAO —Will the Hon. the Minister for Education be pleased to state

(a) Whether the Government propose to introduce 'NEERA' system in the entire State; and

(b) if so, when ?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO —

(a) No, Sir.

(b) This does not arise in view of the answer to clause (a) above.

(a) లేదండి.

(b) పైనచెప్పిన సమాధానంబట్టి రెండో భాగంగా రాదు.

నీరా చాలా ఆరోగ్యమైనదేఅని, మా అందరికీకూడా వెనుక ఒక సారి ఇచ్చినవిషయం సభ్యులకు తెలుసు. దీన్ని గురించి విచారించడానికి కమిటీని ఒకదానిని వేశాం. వారి రిపోర్టుచూచినతరువాత తగినచర్య తీసుకుంటామని మనవిచేస్తున్నాను.

Sri K. GOVINDA RAO-నీరా చాలాఆరోగ్యకరం అయినదని, వుపయోగకరం అయిందని, మాకందరకు ఇచ్చారని చెప్పారు. అందువల్ల ఈ కమిటీవారి రిపోర్టువచ్చేదాకా రాష్ట్రంఅంతా ప్రవేశపెట్టడానికి అవకాశంవుంటుందా ?

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO — నీరా చాలా ఆరోగ్యకరమైనది, చాలామంచిదనడంలో అనుమానం ఏమీలేదుకాని, దాని వుపయోగం ఏవిధంగా వుంటుందనే దానిలో ఆలోచించాలని మా వుద్దేశం. ఈ prohibition విషయంలో ఒక కమిటీని వేశాం. అది వీటన్నిటిని సరిగాపరిశీలించి ఒక రిపోర్టును 5 వారాలులోపుగా ఇవ్వాలనిచెప్పాం. ఈ అయిదువారాలులోగా చాలా విపరీతపరిస్థితులు కలుగుతాయని సభ్యులు అనుకోరని అనుకుంటున్నాను. 7 ప్రదేశాల్లో [illegible] దీన్ని

కల్లుగానే ఎక్కువగా వుపయోగపడుతోంది. అందుచేత ఈ నీరా పద్ధతి రద్దుచేసి కల్లుగానే వుపయోగిస్తే బాగుంటుంది. కాని ప్రజల్లో మనకై మనం అవినీతిని ప్రవేశపెట్టడం మంచిదికాదు. అయినా ఆ రిపోర్టు వచ్చేవరకు ఈ 6 వారాలు ఓపికపట్టండి.

Sri G. ANJANEYULU — ఈ నీరా బాగా ఉపయోగపడ్డమే కాదు. దానివల్ల చాలామంది ఆఫీసర్లు అవినీతికి పాల్పడి దాని ఆశయాల్ని పాడుచేస్తున్నారని ప్రభుత్వానికి తెలుసా? కృష్ణా జిల్లాలో prohibition ఆఫీసరులు లంచాలు తింటున్నారని చెప్పాం. దానిమీద ప్రభుత్వం ఏమైనా చర్య తీసుకుంటున్నారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO— అవినీతి అనేది రెండుపక్షాలా వుంటుంది. అసలు లంచం ఇచ్చేవారు వుంటేగా పుచ్చుకొనేవారు వుంటారు. అందుచేత ఇది రెండు పక్షాల వుంది. ఈ విషయంలో నేను అధికారంలోకి రాగానే వుద్యోగస్తులను అందరిని పిలిపించి గట్టిగా మందలించి చెప్పాను. కట్టుదిట్టంగా ఈ prohibition ను అమలు పరచాలని చెప్పాను. రూల్సును ఎవరైనా వ్యతిరేకిస్తే డిస్మిస్ చేస్తాం అని చెప్పాను.

Sri V. SRIKRISHNA— ఈ నీరాను తయారుచేయడానికి 7 ప్రదేశాల్లో మాత్రమే అనుమతించాం అంటున్నారు. ఈ 7 ప్రదేశాలకు ఇవ్వడంలో అభిమానాలు గాని, పలుకుబడులుగాని వుపయోగించడం జరిగిందా? ఇతర ప్రాంతాలకు ఎందుకు నిరాకరించబడింది?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO— నా దగ్గర ఏవిధమైన పలుకుబడి జరగలేదు. నేను అందరినీ సమానంగానే చూస్తున్నాను. సాధ్యమైనంత వరకు అందరికీ న్యాయం చేయాలని చూస్తున్నాను.

Sri G. LATCHANNA-నీరా చాలా ఆరోగ్యమైనదని చెప్పారు. మద్రాసు ప్రభుత్వంవారు అవలంబించిన పద్ధతి ప్రకారమే ఈ సభ్యులకు కూడా సదుపాయం కలుగచేస్తారా?

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO:— అది అలవాటుపడ్డ ప్రదేశంలో తప్ప వాడ్డంలేదు. గౌరవనీయులైన లచ్చన్నగారు నీరా కావాలని అంటున్నారు. వారు ఇది వరకు సేవించారో లేదో తెలియదు. అది కావాలంటే తెప్పిస్తాం. కాని దాన్ని ఇక్కడ ఎవరూ ఉపయోగించడంలేదు.

*Representation from the Andhra State Handloom Weavers' Congress.*

* 47. Q.—Sri PRAGADA KOTAIAH— Will the Hon. the Minister for Local Administration be pleased to state:

(a) whether the Government have received a representation dated 12-10-1953 from the Andhra State Handloom Weavers' Congress requesting them to exempt the handloom weavers residing both in Municipal and Panchayat areas from the levy of house tax in view of the continued unemployment of handloom weavers in the State; and

(b) if so, the action taken thereon?

The Hon Sri P. THIMMA REDDI:—

(a) and (b):-"A copy of G. O. Ps. No. 107 Local Administration dated 28th December, 1953 is laid on the table of the house". ఒకటి రెండు భాగాలకు సంబంధించినదానికి జవాబు మీ యెదుట పెట్టబడింది.

Sri PRAGADA KOTAYYA—ప్రభుత్వంచేసిన G. O. ను అనుసరించి ఇంతవరకు పన్నులుకట్టకుండా వున్నవాళ్లకు వుపయోగిస్తుం చేతప్ప పన్నును కట్టినవాళ్లకు వుపయోగపడదుకదా? సంవత్సరంలో 9 మాసాలు గడిచిపోయిందికాబట్టి మరొక 6 మాసాలు యీ మినహాయింపు పొడిగించడానికి వీలుంటుందా?

The Hon. Sri P. THIMMA REDDI — ప్రశ్నలోనే చిక్కున్నది. కట్టినవాళ్ళకు ఇబ్బందిగావుంటుంది కాబట్టి కట్టని వాళ్లకు కొంతకాలం సదుపాయంకావాలని అంటున్నారు. కట్టినవాళ్లు మంచివాళ్లు కావచ్చు. కట్టనివాళ్లు చెడ్డవాళ్ళు కావచ్చు. ఇప్పుడు ఇచ్చిన సదుపాయంతో సంతోషపడండి. మిగతా చేయవలసినదాన్ని గురించి ప్రభుత్వం ఆలోచిస్తుంది.

Sri G. C. KONDAYYA—ఇప్పుడు ఈ పంచాయితీ పన్నుల ప్రకారం మంగలివాళ్ళకు చాకలివాళ్ళకుకూడా పన్నులువర్తిస్తుందా?

---

(a) Vide Appendix I at page 135 infra.

The Hon. Sri P. THIMMA REDDY— ప్రత్యేక ప్రశ్న వేయండి.

Sri P. PUNDAREEKAKSHACHARYULU -మంత్రిగారు జవాబు చెప్తూ "కట్టినవాళ్ళు మంచివాళ్ళు కట్టనివాళ్ళు చెడ్డవాళ్ళ"ని అన్నారు. కట్టలేకపోడంచేత వాళ్ళు మంచివాళ్ళు కారా? కట్టలేకపోడం అనేది ఆర్థిక పరిస్థితులనుబట్టి వుంటుంది. కట్టడం అనేది వాళ్ళు మంచివాళ్ళు అయినంతమాత్రంచేత కూడా జరిగిపోవచ్చు కదా?

The Hon. Sri P. THIMMA REDDI— వారికి సంబంధించిన జవాబు కాబట్టి మీరు వారినే అడగండి ఆ ప్రశ్న.

Sri S. NARAYANAPPA — ఇప్పుడు ప్రభుత్వం వీవర్సుకు రిలీఫ్ ఇస్తున్న వృత్తిపన్ను ఫస్టుక్లాసు పంచాయితీలకు కూడా వర్తిస్తుందో లేదో మంత్రిగారు సెలవిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI :— వర్తించకుండా ఉంటే అందరు వీవర్సుకు వర్తించేటట్లు చూస్తాం.

Sri R. SIDDANNA GOWD— ఈ రెమిషన్ ఇవ్వడంవల్ల స్థానిక సంస్థల నష్టాన్ని భరించడానికి గవర్నమెంటువారు అంగీకరిస్తారా?

The Hon. Sri P. THIMMA REDDI:— దాన్ని గురించి యోచిస్తాం.

Sri PRAGADA KOTAIAH — ఈ విషయంలో house-tax exempt చేయడానికి, ప్రభుత్వానికి పంచాయితీబోర్డు తీర్మానాలుచేసి పంపించినప్పటికి కూడా, ప్రభుత్వము ఆమోదించకపోవడానికి కారణము యేమిటి? ముఖ్యంగా రాయచోటి పంచాయితీబోర్డు, ఈ house-taxను exempt చేయడానికి ఏమని సిఫార్సులుపోయాయో కాని, ప్రభుత్వము ఆమోదించలేదు. దీనికి కారణమేమిటో చెప్పగలరా?

The Hon. Sri P. THIMMA REDDI- సభ్యులు వేసిన ప్రశ్న ఒక్క వీవర్సుకు సంబంధించినది మాత్రమే కాదు. అది రాష్ట్రం మొత్తముమీద ప్రభుత్వము యోచించిచేసింది. ఏ ఒక్క పంచాయితీబోర్డుకుగూడా సంబంధించింది కాదు. చేనేతపనివారిని యీ సంవత్సరం ఆస్తిపన్ను, యింటిపన్ను, వృత్తిపన్నులనుంచి మినహాయించవలసినదిగా స్థానికసంస్థలను ప్రభుత్వంకోరింది.

Sri PRAGADA KOTAIAH:—ఈ Property taxన్ను, profession tax న్ను తీసివేయడానికి వీరు applications పెట్టుకోవాలా ? లేక ఆ పంచాయితీ బోర్డులు తీసివేస్తారా ?

The Hon. Sri P. THIMMA REDDI :— ప్రత్యేకముగా application పెట్టుకోనవసరంలేదు.

*Supply of water to Bukkapatnrm Tank.*

* 48. Q-Sri T LAKSHMINARAYANA REDDI — Will the Hon. the Minister for Public Works be pleased to state; whether the Government have any proposal to appoint an expert engineer to investigate whether the Mysore Government have violated the general agreement as regards the supply of water to Bukkapatnam tank in Anantapur District ?

The Hon. Sri N. SANJEEVA REDDI-The answer is in the negative.

Sri T. NAGI REDDI— బుక్కపట్నం చెరువుకు వచ్చే నీరు మైసూరు ప్రాంతంనుంచి రావాలని, ఆ ప్రాంతం నుంచి నీరు రావడానికి అడ్డుపడచూస్తున్నారే, మైసూరు ప్రభుత్వమునుండి ఆంధ్ర ప్రభుత్వమునకు యేమైన వాదన వచ్చిందా ? వస్తే ఆ Memorandum పరిశీలించడానికి ప్రభుత్వము పూనుకొన్నదా ? ఆ విధంగా పూనుకోక పోతే, ఇకముందు పూనుకుంటుందని సెలవిస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI—మద్రాసు ప్రభుత్వానికి శ్రీ T. Lakshminarayana Reddiగారు(ఆగష్టు లోనో యెప్పుడో వచ్చింది, నాకు తెలియదు.) Petition పెట్టారు. ఈ చెరువుకు నీళ్ళు రావడానికి చాలా ఆటంకాలు కలుగజేస్తున్నారని, అందుచేత నీళ్ళు రావటంలేదనే విషయం అందరికీ తెలుసు. ఈ రెండు ప్రభుత్వాలకు 1892 సం॥లో ఒక agreement జరిగింది. ఆ agreementప్రకారం నిర్బంధించే clause యేమీలేదు. ఇవన్నీ కూడా, వారు contract చేశారా, లేదా అనేవిషయం ప్రభుత్వము గమనిస్తున్నది. దానినిగురించి assemblyలో ప్రతిపక్షసభ్యులు యీలాగున ప్రశ్నలు వేస్తే, మనం అనుకొన్న point కు అంతరాయము కలుగుతుంది. ప్రత్యేకంగా ఏమీవుండదు.

Sri T. LAKSHMINARAYANA REDDI:— బుక్క-రాయల కాలంలో కట్టబడిన ఈ చెరువుకు నష్టసీతాని ఎంచుకొనే దానిలో మన ప్రభుత్వానికి, మైసూరు ప్రభుత్వానికి ఒక agreement వుందని మంత్రిగారు చెప్పుతున్నారే, ఆ agreement కు వ్యతిరేకంగా చెరువులు కట్టబడినవనీ, Engineering and technical information వచ్చింది కాబట్టి, దాదాపు 6,000 ఎకరాలకు నీరు పారుదలయ్యే యీ చెరువు నిండనందున సాగుబడి తక్కువ కావటంవల్ల, ప్రభుత్వానికి రెవిన్యూ ఆదాయం నష్టదాయకంగా వుంది. రాయలసీమ లోని కల్లా పెద్దదైన యీ చెరువుకు ఒక గత్యంతరం చూపించి, చెరువుకు సమృద్ధిగా నీరు Supply కావడానికి ఆటంకాలు లేకుండా చేసి దానికి ప్రభుత్వము ప్రయత్నిస్తుందా ?

The Hon. Sri K. KOTI REDDI :— అది ఆలోచిస్తున్నాము.

Sri C. SUBBARAYUDU — ఇంతకుముందు మంత్రిగారు యీ విషయంలో agreement వుందని చెప్పారు. ఆ agreement లో వున్న ముఖ్యమైన షరతులు యేమిటో చెప్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI — ఈ agreement కు సంబంధించిన షరతులు The conditions are : That Mysore Government are prohibited from carrying out the work either on the main stream Chitravati as per Schedule A of the agreement or in the whole basin to the north of Chelur Baganhalli Road. In the rest of the catchment they have unrestricted freedom to hold up water in new irrigation works according to the agreement. ఈ agreement ప్రకారము Mysore ప్రభుత్వము అక్కడక్కడ break చేసినది. ఎందుకు break చేసినదనే విషయం మీరు పరిశీలించి, దానిమీద మాకు దాని పద్ధతి యీవిధంగా అని తెలియజేయవచ్చు. అయినప్పటికీ యీ బుక్కపట్నం చెరువుకు నీరు supply అయ్యే విషయంలో యేవిధంగా సహాయపడగలమో ఆలోచించడానికి ప్రభుత్వంవారు త్వరలో పరిశీలించి, యీ subject పరిష్కారానికి దోహదమివ్వడానికి ప్రయత్నం చేస్తాము.

మైసూరుప్రభుత్వమునుండి జవాబు రావడంతోనే, ఆ విషయాలను యిక్కడ యీ house కు తెల్పడానికి ప్రయత్నంచేస్తాము. ఆ చెరువుకు యెంతవరకు మరమ్మతుచేశారో తెలుసుకోవడం మంచిది. నీరు undisturbed గా supply చేయడానికిచిన్న కాలువలుద్వారా యీ చెరువు bund up చేయడానికి కావలసిన అధికారము Mysoreప్రభుత్వానికివుంది. కాబట్టి, మైసూరు ప్రభుత్వమునుండి జవాబురాగానే, అది జాగ్రత్తగా పరిశీలించి కావలసిన పనులేవో సాధించడానికి ప్రభుత్వము కృషిచేస్తుంది. ఇదంతా ఒక్కసారి కట్టకట్టుకొని చేసేపనిగాదు.

*Takkavi Loan applications in Penukonda*

*49, Q.—Sri T. LAKSMINARAYANA REDDI :—Will the Hon. the Minister for Land Revenue be pleased to state:

(a) the number of pending Takkavi loan applications in Penukonda Taluk in the month of October; and

(b) the number of applications paid in the month of October ?

The Hon. Sri K. KOTI REDDI—

(a) 220

(b) Nil

Sri R. SIDDANNA GOWD- 220 (applications) దరఖాస్తులువచ్చినప్పుడు, ఒకదానికైనా అప్పుఇవ్వలేదు. ఎందుకండీ ?

The Hon. Sri K. KOTI REDDI—ఆనెలలో allotment లేకపోబట్టి అప్పులుయివ్వలేదు. అంతకుముందు రు. 70,000 లు వరకు అప్పులుయిచ్చారు. పిమ్మట నవంబరునెలలో చాలవరకు కావలసిన allotment గవర్నమెంటు యిచ్చింది. కాబట్టి, ఆ నెలలో allotment లేకపోబట్టి అప్పులుయివ్వలేదు. అంతేకాని ఇతరకారణాలు యేమీలేవు.

Sri C. PULLA REDDI :— వచ్చిన applications కు అన్నిటికి ప్రభుత్వము డబ్బు అప్పుయిచ్చిందా ?

The Hon. Sri K. KOTI REDDI :— నవంబరు నెలలోనే allotment అంతా యిచ్చామని చెప్తున్నాము కదా.

Sri N. SIVARAMI REDDI :— అనంతపురం జిల్లాలో రెండు యేండ్లనుంచి వాయిదాల మీద సిమెంటు నే సగం మీద తక్కావి అప్పులు యిస్తామని ప్రభుత్వము ప్రకటించినసంగతి పత్రికలలో చూశాము. ప్రభుత్వము ఉత్తరువు యిచ్చినట్లు ఆంధ్ర పత్రికలో చూచాము. 5, 7 ఏండ్లలో తీర్చలేని రైతాంగము రెండేండ్లలో యెట్లా తీర్చగలదో చెప్పగలరా ?

The Hon. Sri K. KOTI REDDI :— ప్రభుత్వ అభిప్రాయంలో తీర్చగలరనే అనుకొంటున్నాము.

Sri T. LAKSHMINARAYANA REDDI:— అక్టోబరు నెలలో 220 applications వున్నప్పుడు గూడా, వ్యవసాయమునకు అవసరమైన కాలంలో అప్పులు యివ్వలేదు. వ్యవసాయమునకు అక్కర లేని కాలంలో అప్పులు యిచ్చుటకు ప్రారంభిస్తారు. వారికి సకాలంలో అప్పులు యిచ్చే సావకాశము కలుగజేస్తారా ?

The Hon. Sri K. KOTI REDDI:- నేను వ్యవసాయదారుడను కాబట్టి, october నెలలో అప్పులు యివ్వలేకపోయినా June నెలలో యిచ్చినప్పటికీ రైతులు నష్టపడేదేమీ లేదు. చెరువులకు నీరు నిండేది నవంబరు, డిశంబరు నెలలోనే. అప్పుడు పనులు ప్రారంభిస్తారు. అందువల్ల అప్పట్లో Government కావలసిన allotment యిచ్చారు. ప్రత్యేకముగా applications వచ్చినపుడు నేను చెప్పగలను. Allotment చేశారు కాబట్టి అటువంటి యిబ్బంది యేమీ వుండదు.

*Primary Weavers' Co-operatives in the State.*

*** 50. Q. - Sri PRAGADA KOTAIAH:- Will the Hon the Minister for Planning and Public Health be pleased to state :**

(a) the extent of losses sustained by the Primary Weavers' Co-operatives in the State during 1951-52 and 1952-53;

(b) the total sum of audit fees collected from the Weavers' Co-operatives in the State during 1951-52 and the amount ordered to be collected for the year 1952-53 ?

The Hon. Sri D. SANJIVAYYA —

(a) The loss sustained by the Weavers' Co-operative Societies in the State during 1951-52 and 1952-53 was Rs. 12,02,628-0-0 and Rs. 32,15,983-7-0 respectively.

(b) The total amount of audit fees collected from the Weavers' Co-operative Societies in the state during 1951-52 was Rs. 19,039-14-0 while that levied during 1952-53 was Rs. 23, 136-8-0

Sri PRAGADA KOTAIAH:-అయ్యా, ఈ ప్రాథమిక సహకార సంఘాల నుండి audit fees వసూలు చేయడం ప్రస్తుతానికి నష్టాలు విపరీతంగా వస్తున్నందున నిలుపవలసిందని చాలకాలంనుంచి ప్రార్థేయ పడుచున్నాను, ప్రభుత్వము యిప్పటికైనా ఆడిట్ రుసుమును రద్దు చేస్తుందా?

The Hon. Sri D. SANJIVAYYA :- 20-3-1953 వ తేదీన సొసైటీవారు ఒక తీర్మానంచేశారు. 1952 - 53 సం॥ము audit fees తొలగించడము అవసరమని తీర్మానించినప్పుడు, దాని మీాద Composite state registrar ను ప్రభుత్వము ఒక reportఅడిగింది. ఆ report వారుయిచ్చారు. దానిమీాద చర్య తీసుకోవడంకంటె, మన ఆంధ్రప్రభుత్వ registrar వద్ద నుంచి రిపోర్టు తీసుకోవడం సమంజసమని, వారిని ఒకరిపోర్టు అడిగాము. అది రాగానే ప్రభుత్వము ఆలోచిస్తారు.

Sri B. SANKARAYYA:—ఈ సొసైటీలు చాల నష్టంలో పనిచేస్తూన్నట్లు తెలుస్తున్నది. కాబట్టి, దీనికి ప్రధానకారణం నూలు ధరలలోవున్న తేడా కాబట్టి బట్టలమిల్లులకు సరఫరాచేసే ధరలకే చేనేతపారిశ్రామికులకు నూలు అందజేసి సొసైటీలకు నష్టమురాకుండా చూస్తారా?

The Hon. Sri D. SANJIVAYYA — Composite Madras state registrar ను రిపోర్టు పంపించమని అడగగా, వారు ఒక రిపోర్టు పంపించారు. ఆ రిపోర్టువల్ల ప్రయోజనము లేనందున మన రిజిస్ట్రారువద్దనుంచి, రిపోర్టు call for చేశాము. ఆ రిపోర్టు రాగానే మీా [illegible] పెట్టి [illegible] తుది నిర్ణయం ప్రభుత్వం చేస్తుంది.

(e) The present problem now facing the handloom industry is one of finding ready markets, both internal and external, for the handloom products and not one of providing financial assistance only.

As for external markets, the Government of India approved a scheme for the appointment of Commercial Travellers and to open sales Emporia in selected places abroad to explore and expand external markets for the handloom products.

Regarding internal markets, the All India Handloom Board has set up a Central Marketing Organisation, with its head-quarters at Madras, to explore and expand internal markets. The All India Handloom Board since approved a scheme to observe one week every year as "All India Handloom Week" and to hold countrywide celebrations during that week to give intensive publicity to the handloom industry and to rouce the interest of the people in handloom fabrics.

One of the scheme approved by the Government for the development of handloom industry, in connection with the utilisation of Cess Fund, is the expansion of the organisation of the State Co-operative Society for internal marketing and propaganda for sale of handloom cloth and inter-state marketing.

The question of granting a loan to the Andhra Handloom Weavers Congress to enable it to purchase the accumulated stocks of handloom cloth accumulated in the primary weavers societies is under active consideration of the Government.

Sri T. NAGI REDDI:—అధ్యక్షా, ఈనాడు hand loom cloth అంతా అమ్ముడుపోయేటట్లు చేయటానికిగాను ప్రభుత్వం బ్రహ్మాండమైన publicity యివ్వబడుతున్నదని మంత్రిగారు శెల విచ్చారు. ప్రజల కొనుగోలుశక్తి తగ్గిపోయినప్పుడు, ప్రజలు ఆ cloth ను కొనుక్కొగలరా ? ప్రభుత్వం యీ విషయం గమనించి ఏమైన చర్యతీసుకుంటుందా ? లేకపోతే ప్రజలకు అప్పు యిస్తుందా ?

The Hon. Sri S.B. P. PATTABHI RAMARAO: ప్రజలకు కొనుగోలుశక్తి పెంచటానికి ప్రభుత్వం తగుప్రయత్నంచేస్తుంది.

Sri C. SUBBARAYUDU — ఈ రాయలసీమ గ్రామాలలో గుడ్డలు నేసినప్పుడు వాటికి finishing బాగాపుండనందునే కారణంతో అమ్మకానికి మార్కెట్టు పడిపోయిందని మంత్రిగారికి తెలుసును. Co-operative societies ద్వారా సప్లయిచేయించినట్లైతే, దానికి finishing బాగా వుండదనిన్నీ. ఆ సరుకు అమ్ముడుపోవటానికి పద్ధతులు ప్రభుత్వము ఆలోచించాలని, మనసభ్యులు చేసిన సూచనవిషయములో నేనొకవిషయము చెప్పదలచుకున్నాను. రాయలసీమలో నేసేటటువంటి గుడ్డలుగూడా దేశప్రసిద్ధికెక్కినదేనని చెప్పగలిగివున్నాను. ఇతర జిల్లాలలోకన్న రాయలసీమలో తయారుచేయబడిన గుడ్డకు మంచి finishing వున్నదని నేను రుజువుచేయగలను. ఉదాహరణకు కడప జిల్లాలోని పుల్లంపేట చీరలు వగైరాలు దేశమునందంతటను ఎగుమతి అగుచున్నవి. ఈ పుల్లంపేట చీరలు ముఖ్యంగా [illegible] అనేకచోట్లలో వాడకము జరుగుచున్నది. దీనినిబట్టి రాయలసీమగుడ్డ అంటె, మంచి finishing యివ్వడములో మరి యితర ఆంధ్రజిల్లాలకు తీసిపోదని ప్రభుత్వము, సభ్యులుగూడా గుర్తించాలి.

Mr. SPEAKER — Questions over. Question Nos. 52 and 54 are postponed to 8th January, 1954. The other Quetions and answrers will go into the proceedings.

* 53. Q—Sri T. LAKSHMINARAYANA REDDI :— Will the Hon. the Minister for land Revenue be pleased to state :

The amount disbursed to the applicants who applied for loans to purchase paddy seeds and manure in Penukonda Taluk in the month of october, '53?

The Hon. Sri K. KOTI REDDI — No amount was disbursed towards loans for the purchase of paddy seeds and manure in Penukonda Taluk in the month of October, 1953 as no need arose in that month.

* 55 Q.—Sri P. GUNNAYYA :— Will the Hon. the Minister for land Revenue be pleased to state :

(a) Whether the matter relating to the repair of the Vandrangi old channel, that passes through

Madupam, has been pending with the office of the manager of the Vijayanagaram Estate for one year ;

(b) Whether it will irrigate nearly 3000 acres of wet land which will yield three crops ; and

(c) When the Government will get the channel repaired ?

The Hon. Sri P. THIMMA REDDI :—

(a) No.

(b) No.

(c) The restoration of the channel has been proposed to be taken up in the year 1954—55

(*Note* **An asterisk at the commencement of a speech indicates revision by the Member.**)

*Point of order re : Terms of reference to the Prohibition Enquiry Committee*

SRI C. V. K RAO — అధ్యక్షా ! ఇక్కడ ఒక paper సభ్యులకు అందజేశారు. అది Probition committee ఏర్పాటు చేయడం విషయంలో ఇంతకు ముందు మంత్రిగారు ఇక్కడ యీ కమిటీని ఏర్పాటు చేసినప్పుడు తెలియజేసిన స్టేటుమెంటులో యీ Prohibition Committee ఒకటి ఉండాలా, లేదా, అనేవిషయమును గురించి చర్చిస్తుందని యిక్కడ విన్నవించారు. ఇక్కడ గవర్నమెంటు శెక్రటరీగారి సంతకముతో వచ్చినటువంటి issue, prohibition ఎట్లా పనిచేస్తుంది అనేవిషయముతప్ప, ఉండాలా, లేదా అనే విషయం యివ్వలేదు. కాబట్టి అంతకుముందు ఇచ్చినస్టేటుమెంటుకు, యిప్పుడుచేసిన స్టేటుమెంటుకు పరస్పరవిరుద్ధముగావున్నది. ఇక్కడ సభ్యులను misdirect చేయడమేఅవుతుంది, అనివార్య అన్నారు. పైన యిచ్చిన issue యేమిటి అని అడుగుతున్నాను.

The Committee is requested to—

(a) Review the working of the Scheme in the areas comprising the Andhra State both before and after the creation of the Andhra State,

(b) Examine the Scheme in the light of results in all its aspects in relation to the individual, the Society and the State including problems of administration, and

(c) make its recommendations before 15—2—1954.

కనుక Prohibition ఎట్లా పనిచేస్తుంది అని అడుగుతున్నాను. దానికినీ, వాళ్ళ రిపోర్టు అది వుండాలని గాని, వుండకూడదని గాని అనేది వాళ్ళ recommendation లోనే వుంది. అంతకు ముందు యిచ్చిన Statement కు యిప్పుడు గవర్నమెంటు చేసిన publication కు పరస్పర విరుద్ధముగా వుంది.

The Hon Sri S. B. P. PATTABHIRAMA RAO:—

అధ్యక్షా ! అసలు preamble లోనే ఆ issue తెలిపాము. మీరు ఒకవిషయం గమనించినట్లు లేదు. The government have taken into consideration the various views that have been expressed from time to time on prohibition since its inception in 1937 in the Madras State. The creation of the Andhra state has focussed public attention on prohibition as a State policy. The government consider that it is an opportune time to consider the question afresh in all its aspects including the question of its retention or otherwise and the modifications that have to be made if it is to be retained.

అయితే " the committee is requested to " అని లేక పోయినంతమాత్రాన, అది దాని అర్థం కాదు. మొదట్లో నిర్ణయ time తక్కువగా వుండడమువల్ల యీ communique పంపించాము. ఇందులో ఏవిధమైన అనుమానం లేదు. అని చెబుతున్నాను. కాబట్టి ప్రభుత్వ అభిప్రాయములో ఏవిధమైన అనుమానములేదు. అని మీకు మనవి చేస్తున్నాను. కాబట్టి " continuation or otherwise" అని అక్కడ preambleలో వుంది. ఇవ్వాళనే communique States కు వెళ్ళింది. కాని మేము ప్రత్యేకంగా పంపలేదు. issue లో కూడా అది మరల clarify చేస్తున్నాము.

*V. Budget for 1953 - 54*
*Votting Demands for (I) grants for 1953 - 54*
*Demand (II) for State excise duties cont.*

Mr. SPEAKER:-ఇప్పుడు పదిఘంటలు అయినది. ఈdemand మీద 45 నిమిషములు spend చేశాము. కాబట్టి ఇంకా పది ఘంటల 45 నిముషములకు యీ చర్చను ముగిద్దాము.

The Hon. Sri S. B. P. PATTABHIRAMA RAO — అందుకనే నేను చెబుతున్నాను.

Mr. SPEAKER— The number of speakers is mounting up like anything. Consistently with that, the members will adjust the time.

**III Presentation of Petitions of the House.**

Sri. C. V. K. RAO: పట్టాభిరామారావుగారికి యివ్వమని నాకు కొన్ని వేల పిటిషనులు వచ్చాయి. అందులో ఒకటి యీ House దృష్టికితీసుకొని వచ్చాను.

Sri VAVILALA GOPALAKRISHANAYYA—
Mr. Speaker, Sir, Please see Rule 142 of the 'Rules of procedure of the Legislative Assembly'. I will just read that thing :

"142. Petitions to the Assembly must—

x x x x

(b) be addressed to the members of the Assembly;

(c) be dated and signed by the petitioner or petitioners.

x x x x

అందువల్ల నేను ముఖ్యముగా చెప్పేది ఏమిటంటే Be addressed to the members of the Assembly అనివుంది.

Mr. SPEAKER—All these petitions will be given the necessary disposal. Mr. M. Venkatasubba Reddi will speak now.

**IV Budget for 1953-54**

**Demand II State Excise Duties (contd.)**

Sri M. VENKATASUBBA REDDI— అధ్యక్షా !

మద్యపాన నిషేధము ఒక సాంఘిక సంస్కరణకు సంబంధించిన విషయం. అది జయప్రదముగా నిర్వహింపబడాలంటే ప్రజలలో విరివిగా ప్రచారము జరగాలి శాసనాలు చేస్తే చాలదు. ఇది మనము ప్రత్యక్షముగా చూస్తున్నాము. గ్రామాలలో గ్రామపెత్తనదార్ల సహాయంతో ఉద్యోగస్థుల అండనే ఈ వ్యాపారము జరుగుతున్నదన్న విషయం అందరకు తెలుసును. దీనికి పరిష్కార మార్గంగా కొన్ని సూచనలు చేస్తున్నాను. 1st class Magistrate లను ఏర్పాటుచేసి సమ్మరీ ట్రయల్సుకు అవకాశం కల్పించాలి. ఎక్కడైనా raid జరిగినప్పుడు మాజిస్ట్రేటును తీసుకువెళ్ళి అక్కడే విచారణ జరిపి ఎక్కువ జరిమానాలు విధించేటట్లు చేస్తే ఆ మేజిస్ట్రేట్లకు అయ్యేఖర్చులుకూడా వసూలు

చేసుకోవచ్చును. అయితే దానికి సనుయుక్తోడు సమ్మతించారు చెప్ప వచ్చును. అంతేటివిఅసహాయస్థితిలో ఈనాడు ప్రభుత్వంవుంది. కోట్ల కొలది ఆదాయము పోవడమే కాకుండా సిబ్బంది ఖర్చులక్రింద కోట్ల రూపాయలు వృథా అగుచున్నది. కాబట్టి ఈ శాసనము రద్దుచేసినా మంచిదే. మంత్రి పట్టాభిరామారావుగారు చెప్పారు. సర్వోదయ కార్యకర్తలు మద్యనిషేధ శాసనంరద్దుచేస్తే నిరశనవ్రతం చేస్తామంటున్నారు. దానికి సమాధానము వారువెళ్ళి ఆ త్రాగేవారివద్ద కల్లు తయారుచేసేవారివద్ద నిరశనవ్రతంచెయ్యమనండి. వారువెళ్ళి యెందుకుప్రచారము చెయ్యడంలేదో తెలియకుండావుంది. ఈ బెదిరింపులతో ప్రయోజనములేదు. దానిని ఆలోచించ నవసరంలేదు వారికి చిత్తశుద్ధి వుంటే ప్రజలలోకివెళ్ళి ప్రచారము చెయ్యమని చెప్పండి. అంతేగాని కమిటీలద్వారా యీ సమస్యను పరిష్కరించ చూడడం పొరపాటు. శాసనము అమలు జరగని ఎడల దానిని రద్దుచెయ్యడమే మంచిది. వచ్చేడబ్బుతో నిర్మాణపనులు నిర్వహించవచ్చు.

ఇక కాచేసారాయి విషయం కొంత చెప్పాలి. ఆరోగ్యానికి భంగకరమైన సారాయి తయారగుచున్నది. ఇంతకు ముందుకంటే యీనాడు త్రాగుడు ఎక్కువ అయింది. అనేకమంది కాంగ్రెసుపక్షం వారు కూడా యీ శాసనము రద్దుచెయ్యవలెనని అంటున్నారు. కాబట్టి యీ కట్ మోషను యావన్మంది బలపరుస్తారని నేను ఆశించు చున్నాను.

Sri G. C. KONDAIAH— అధ్యక్షా! ఈ మద్యనిషేధం మళ్ళీ ఈనాడు చర్చకు వచ్చింది. దీనిని గురించి మొన్నటి సమావేశంలోను, గత సంవత్సరం కూడా చర్చకు వచ్చింది. ఇప్పుడు ఒక కమిటీ వేసినారు. అది న్యాయమైన అభిప్రాయం తెలుపవచ్చును. ఈలోగా ప్రభుత్వం కనీసం కల్లుమీద నిషేధం తీసివేస్తుందని మేము నమ్ముచున్నాము. ఎప్పుడైనా ఉన్నట్టు దురాచారాలను పోగొట్టడానికి ప్రజలపరిస్థితులను తెలుసుకొనవలెను. ఈ వేళ ప్రజలు త్రాగడానికి కారణము వారి ఆర్థిక దుస్థితి జీవితనిస్పృహ, ఈచట్టం వ్యభిచార నిర్మూలనాచట్టం చేసినట్లుగా వుంటుంది. యీ చట్టాన్ని అమలు చెయ్య డానికి నియమించ బడిందో ఆ డిపార్టుమెంటు సహాయంతోనే యీ కల్లు వ్యాపారం జరుగుతుంది. విఫలమా, సఫలమా అనే మాటలేదు. ప్రతి నెలా వందలకొలది జైళ్ళకు వెళ్ళుతున్నారు. కాబట్టి యీచట్టం అమలు జరగడం లేదన్నమాట. ఇది ప్రభుత్వానికి ఒక సెంటిమెంటలు సమస్యగావుంది. సర్వోదయ కార్యకర్తలు ఇందుకు అడ్డముగా వున్నా

రనడం సబబైన మాటకాదు. యీసర్వోదయవారు ఆ త్రాగేవారివద్దకే వెళ్ళి ప్రచారమో ప్రాయోపవేశమో ఎందుకు చెయ్యకూడదు. చట్టదిక్కారము ప్రజలకు ఒక విధముగా నేర్పుతున్నది యీ మద్యపాన నిషేధ చట్టం పోని యెవరిచెట్టుకల్లు వారు త్రాగేదానికైనా వీలు కల్గించండి. యీ అమలులోలేని చట్టము కొన్ని వేలమందికి పనిలేకుండా చేసింది. దీనిని అమలు చెయ్యాలని చెప్పడం అర్థంలేనిమాట. కమిటీ రిపోర్టువరకు వేచియుండ నవసరంలేదు. మంత్రివర్గ ఉద్దేశం ఏమిటో స్పష్టముగా తెల్పవలసిన అవసరం వచ్చింది. దీనిని ఆధారము చేసుకొని కమిటీ ఒక నిర్ణయానికి రావడానికి వీలుకలుగుతుంది. ఆ విధముగా ప్రభుత్వం చేస్తుందని నమ్ముతున్నాను.

Sri K. VEERANNA PADAL—అధ్యక్షా! యీ మద్యపాన నిషేధచట్టం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో అమలు జరుపబడింది. యీ మద్యపాన నిషేధచట్టము ఏజన్సీ ప్రాంతములోకూడా అమలు జరుపబడింది. యీ చట్టాన్ని ఏజన్సీప్రాంతంలో అమలు జరుపవద్దని, అచ్చటప్రజలు తిరుగుబాటుచేసే ప్రజలనీ, నేను మద్రాసు ప్రభుత్వానికి మద్రాసు శాసనసభలో విన్నవించాను అయినా అక్కడ, కొండ ప్రాంతములలో యీ చట్టమును అమలుజరపడం చాలా శోచనీయమైన విషయము. కారణంఏమంటే ఏజన్సీ climate ను బట్టి కొండ ప్రాంతప్రజలు నల్లమందు వాడడానికి అలవాటుపడియున్నారు. నల్లమందువుంటేనే వారు సరిగా ఏ పనినైనా చెసుకోగలరు. వారికి నల్లమందు నిత్యావసరవస్తువు. నల్లమందు లేక చాలా ముసలివాళ్ళు కూడా చాలామంది మరణించుచున్నారు. (agency) ఏజన్సీ ప్రాంత ప్రజలు medical officer వద్ద (permits) పర్మిట్లు తీసుకోవడంకోసం 100, 150 మైళ్ళు రావలసివుంది. అలాగ వాళ్ళువచ్చి పెర్మిట్లు తీసికొనుటకు వారికి చాలా కష్టతరంగావున్నది. అందుచేత ఏజన్సీప్రజలకు నల్లమందుపర్మిట్లను ఎక్కడికిఅక్కడే యిచ్చేఏర్పాట్లు చేయవలయునని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. యీ మద్యపాన నిషేధచట్టమును రద్దుచేసి నల్లమందును ఏజన్సీప్రజల అందరికీ అందుబాటులో వుండునట్లు చేయాలని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. యీ చట్టమును ఏజన్సీప్రాంతములో అమలులోపెట్టడం చాలా కష్టమైన విషయము. అక్కడిప్రజలు తిరుగుబాటుచేసేవారు, అని మద్రాసుప్రభుత్వంకూడా అప్పట్లో సెలవిచ్చియున్నారు. ఆ స్థితిలో యీ చట్టాన్ని అచ్చట అమలుజరపడం చాలా శోచనీయమైన విషయము. అచ్చట యీ చట్టమును అమలుజరుపుటవల్ల అక్కడవున్న అందరికీ చాలా ఇబ్బందులు

కలుగుచున్నాయి. అక్కడ వున్న ఏజన్సీ ప్రజలు తిరుగుబాటు చేసేవారు. అందుచేత ప్రభుత్వం అక్కడ వున్న ఏజన్సీ ప్రజలను మద్యపాన నిషేధ చట్టాన్ని రద్దుచేసి వారి యిబ్బందులను తొలగింపగలరని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri RAJA V.V. KRISHNAM RAJU BAHADUR- అధ్యక్షా! ఇపుడు ప్రస్తుతం ఇక్కడ ప్రవేశ పెట్టబడిన prohibition Demand విషయంలో నేను దానిని ఆమోదిస్తున్నాను. ఎందుచేతనంటే prohibition మన రాష్ట్రంలో వుంటేమంచిది. కాని ఇపుడు చాలామంది ప్రజలు, చాలామంది శాసనసభ్యులు దీనిని వ్యతిరేకిస్తున్నారు. ఈ మద్యనిషేధ చట్టం వుంటే ప్రభుత్వానికి ఖర్చు ఎక్కువై రాబడి తక్కువ అంటున్నారు. నిజంగా దీనివల్ల ప్రభుత్వ రాబడి తగ్గిపోయింది. ఈ మద్యనిషేధం మంచిదే అయినప్పటికి, మన దేశంలో నూటికి 80,90 మంది విద్యావంతులు కాకపోవడం మూలాన, అది ప్రజలకు యిష్టంలేకపోవుటవల్ల సరిగా అమలు జరుగుటలేదు. కాని నేను ముఖ్యంగా ఇక్కడ ప్రస్తుతం ఉంచేటువంటి demand ను ఆమోదించవలెనని మనవి చేస్తున్నాను. ఈ మద్యపాన నిషేధము గాంధీమహాత్ముని ఆధ్యాత్మిక సూత్రములలో నొకటి. గాంధీ మహాత్ముని ఆధ్యాత్మిక సూత్రములలో, ఆ రోజులలో ఉప్పు సత్యాగ్రహం కూడా ఒకటైయున్నది. గాంధీమహాత్ముని అనుయాయులంతా ఆయన ఆశయాల సాధనకై పాటుపడ్డారు. ఉప్పు సత్యాగ్రహం చేశారు. మద్యపాన నిషేధమును అమలు జరిపారు. ఉప్పుపన్ను తగ్గించారు. ఈ మద్యపాన నిషేధం గాంధీమహాత్ముని ఆశయం. దానిని ఇపుడు మనం సాధించవలసినదే. అయినప్పటికీ మన దేశంలో నూటికి 80,90 మంది అజ్ఞానులగుటవలనను, 10 మంది కూడా విద్యావంతులు లేకపోవుట వలనను ఇప్పటి పరిస్థితులలో అది అమలు జరుగుట కొంచెం కష్టంగానే యున్నది. మన దేశంలో చాలా మంది అనగా నూటికి 80 మంది అజ్ఞానులు, చదువుకున్నవారు కారు. అందుచేత మన దేశంలో మద్యపాననిషేధం అమలు జరగడం కష్టంగాయున్నది. ఇందాక ఎవరో చెప్పారు. ఒక కమిటీని నియమించి మద్యనిషేధ చట్టంగురించి అన్ని ప్రాంతములలోని ప్రజల అభిప్రాయాలను తెలుసుకొని తరువాత దానిని తీసివేయడమో ఉంచడమో ప్రజాభిప్రాయం ప్రకారం చేయడం మంచిదన్నారు. మన ఆంధ్ర దేశంలో నూటికి 10 మందికూడా విద్యావంతులు లేకపోవడం వల్ల మన రాష్ట్ర ప్రజలను ఒప్పించడం చాలా కష్టం. ఇక్కడున్న శాసనసభ్యులు, మన రాష్ట్ర ప్రజలు, ఈ మద్యపాన నిషే

ధానికి వ్యతిరేకులు. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకొని దీనిని రద్దుచేయమని చెప్పడానికి బదులు, వారే ప్రజలమధ్యకుపోయి ఈ మద్యపాన నిషేధచట్టంవల్ల కల్గే లాభములను వారికి నచ్చచెప్పి ఒప్పించి వారిని ఈ చట్టానికి సుముఖులుగా చేయవలసి యుంటుంది. అసలు ఆయుర్వేదంలోకూడా ఏదైనజబ్బు, ఏ విధమైన ఔషధమునకూ తగ్గకపోతే ప్రతి రోజూ ఉదయం పోతుతాడి కల్లును త్రాగినట్లైతే నివారణ అవుతుందని ఉన్నది. బ్రిటిష్ ప్రభుత్వం వచ్చిన తరువాత, వారి సాంప్రదాయములకు అలవడి వారి అనుయాయులుగా మనదేశంలోని వారు తయారయూరు. వారి సాంప్రదాయాలను బట్టిచూస్తే వారు ఉత్తేజం కోసమై సారాను ప్రతిరోజూ ప్రతి పూటా సేవిస్తూ ఉంటారు. వీరు కూడా ఆ సాంప్రదాయాల ననుసరించడంవల్ల మన దేశంలో వారికి కూడా చాలా విరివిగా దానిని త్రాగడం అలవాటై పోయింది. మన దేశంలోని labour class వారు, అనగా పేదప్రజలు దీనికి ఎక్కువగా అలవడి, ఆర్థికంగానూ, అనేక విధాలుగా చాలా కష్టపడుతున్నారు. దీని వలన మధ్యతరగతివారు labour class వారు, ఎక్కువగా బాధ పడుతున్నారు. ఈ మద్యపానం ఎక్కువగా ఉండడంవల్ల వారికి శరీరారోగ్యం కూడా చెడి పోవుచున్నది. ఇక నల్లమందు విషయం చూస్తే నల్లమందు అంటే నల్లమందు" అనగా చాలామంచి మందు అనికూడా అర్థం చెప్పకోవచ్చు. అది చాలా మంది ప్రజలకు అలవాటైనది. ఇదికూడా చాలా మందికి ఔషధంగా ఉపయోగ పడుతోంది. దీనికికూడా మద్యపాన నిషేధచట్టం అనువర్తింప చేయడంవల్ల చాలామంది ప్రజలు చాలా కష్ట పడుతున్నారు. ఈ మద్యపాన నిషేధ చట్టమును ఒక్కసారిగా తీయడంవల్ల అదిసరిగాఅమలు జరగక పోవడమే కాకుండా ప్రభుత్వానికి ఆర్థికంగా చాలా నష్టం వచ్చుచున్నది. ప్రస్తుతం ఈ చట్టమునకు ప్రజానీకం అంతా వ్యతిరేకంగానే యున్నారు. దీనికి ప్రజలు సుముఖంగా ఉంటే అపుడు ఇది సరిగా అమలు జరుగుతుంది. ఇపుడు మనదేశంలో నూటికి 80 మంది విద్యావంతులు కాకపోవడం మూలాన ప్రజలు దీనికి వ్యతిరేకంగా యున్నారు. వీరికి, ఈ చట్టము వలన కలిగేలాభం తెలియజేసి వీరిని సుముఖులుగా చేయుట మంచిది. అపుడు కాని ఈ మద్యపాన నిషేధం సక్రమంగా అమలు జరగదు. అందుచేత నేను ఇపుడు అందరినీ కోరేదేమిటంటే మీరంతా ప్రజలముందుకుపోయి వారికి దీనివల్ల కలుగు లాభాలను బోధించి వారిని ఒప్పించి, సన్మార్గానికి తీసుకు రావలయును. ఈ ప్రభుత్వాన్ని కూడా కోరే దేమిటంటే వారు ఏ official committee ని గాని non-official committee ని వారు నియమిస్తే వారు ప్రజలమధ్యకు పోయి వారిని ఒప్పించి వారి

ఎంతమంది ఈ కల్లుగీతవాళ్లున్నారు. ఎంతమంది క్షేమంకోసమై దీనిని వద్దంటున్నారని అడుగుచున్నాను. ప్రజానీకంలోకివెళ్ళి చూడండి, ఎంత మంది కల్లుగీతవాళ్లున్నారు. ఎంతమందికూలీలున్నారు. ఎంతమంది ఇతర చేతిపనులుచేసుకొని జీవించేవారున్నారు. ఎంతమంది రైతాంగముంది. అనేవిషయంతెలుస్తుంది. ఈవిధంగా లెక్కవేసి చూచుకొన్నట్లైతే, నూటికి 70,80మంది నిరుపేదలు ఈ త్రాగుడుకు అలవాటుపడి పాడై పోతూవుండేవారున్నారని తెలుస్తుంది. ఇంతమంది జీవితమును నాశనముచేసి వారికుటుంబాలను యమకూటములో పడద్రోసి మనం ప్రాజెక్టులుకట్టుకొని, మనబొజ్జలునింపుకొని మనం సాగిపోతామంటే, ఇదేనా మనమానవత్వం? ఈవిషయంలో ఈ prohibition పెట్టకముందు, ఎంత మంది త్రాగుబోతులుండిరి. వారు ఏవర్గానికి చెందినటువంటివారు. కల్లుకు ఎంతమంది అలవాటుపడ్డారు. సారాయికి ఎంతమంది అలవాటుపడ్డారు. తరువాత ఈరోజున ఎంతమంది కల్లుత్రాగుతున్నారు. ఎంతమంది సారాయి త్రాగుతున్నారు. ఈ త్రాగుడు ఏ వర్గంలో ఎక్కువఅయింది, ఏ వర్గంలో తక్కువఅయింది అని లెక్కలుతీసిన శాసనసభ్యుడు ఉన్నాడా? ఇప్పుడైనాసరే, ఏ గ్రామమునకైనా పోదాము అక్కడికిపోయి లెక్కలు తీద్దాము. ఈ విషయాలన్నీ వారిముందు పెడదాము. వారు ఏమి చెబుతారోచూద్దాం. అప్పుడు గనుక నిజంగా వారు ఈprohibition రద్దుపరచవలసిందని చెప్పినట్లైతే, నేను క్షమాపణవేడుకొని నా అభిప్రాయాన్ని మార్చుకొనుటకు సిద్ధంగావున్నాను. అవిధంగాచేయకుండా,కల్లు గీతవాళ్ళకు పనిలేదనిచెప్పి, వాళ్ళవోట్లు సంపాదించుకోవడానికి ఏ పది మందికోసమయ్యో 80,90 మంది జీవితాలనునాశనం చేయడానికి పూనుకో వద్దని వారికి మనవిచేసుకొంటున్నాను. ఇది అనుకొన్నమోస్తరుగా సక్రమంగా అమలుజరపాలనే విషయముమాత్రం నిర్వివాదము. స్వతాజ్యము వస్తేగనుక,మనకువెంటనేస్వర్గలోకంవస్తుందని ప్రజలుఆశించారు. అయితే శాస్త్ర అనుభవముండేటటువంటివారు ఈ విషయం సరిగా తెలుసు కొంటారు. కనుక అనుకొన్న కార్యక్రమం వెంటనే జరగాలంటే సాధ్యం కాదు. ఇప్పుడు ఇది సక్రమంగా అమలు జరుగకపోవడానికి కారణం ఏమిటి. దీనిని నవరించటానికి ప్రభుత్వము ఏమిచర్యతీసుకొన్నది. దానికి ఏమైన మార్గమున్నదా. దానిని సక్రమంగాఅమలుజరుపుటకు అవకాశ మున్నదా అనేదృష్టితో ఆలోచించారా? దీనిని ఉల్లంఘించిన [illegible] కఠినచర్య తీసుకొన్నదా: ఈవిషయాలన్నీ ఆలోచించవలసియున్నది. ఇప్పుడు [illegible] పంజాబునుంచి చెల్లమణి వస్తోంది. [illegible] [illegible] వస్తున్నది. [illegible] వస్తున్నది. [illegible] ముఖ్యంగా

ఈ బెల్లం భాగాతయారవుతూంది. అంతేకాకుండా, liquid రూపములో కూడ వస్తూంది.

Mr. SPEAKER :—The Hon. Member will resume his seat as he has exceeded the time limit.

* Sri K. PATTABHI RAMAIAH:—ఉపాధ్యక్షా ! ఈనాడు ఆంధ్రశాసనసభలోను, ఆంధ్రదేశములోను ప్రధానంగా కొన్ని సమస్యలు ప్రాముఖ్యత వహించినవి. అవి ఆంధ్రరాజధాని సమస్య, మద్యపాన నిషేధము, నూతన విద్యావిధానము, భూమిసమస్య, వీటిని గురించి, పార్టీ సంకెళ్ళుకూడా అడ్డుటలేదు. ఇవి ప్రజానీకంలో చొరుచుకుపోయే తీవ్రపరిస్థితి ఏర్పడిందని గమనించవలసి యున్నది. అటువంటి పరిస్థితులలో, ఈ Prohibition చట్టము గురించి ఆలోచించి నట్లైతే, ఈ చట్టముయొక్క aims and objects చాలా ఉత్తమోత్తమ మైనవే కావచ్చు. ఉద్దేశ్యం మంచిదే కావచ్చు గాని, ఆచరణలో దీనిఫలితము పూర్తి భిన్నముగా జరుగుతున్నదని చెప్పక తప్పదు. అయితే చల్లా సుబ్బారాయుడుగారు ఈ విషయం గురించి లెక్కలు తీసుకొంటే, ముందు ఎంతమంది త్రాగుచుండిరి, ఇప్పుడు ఎంతమంది త్రాగుచున్నారు, దీనిని ప్రజానీకం రద్దుచేయమంటుందా, లేక అమలుపరచమంటుందా చూద్దామంటూ, ఇప్పుడు చాలా కొద్దిమంది మాత్రమే అక్రమంగా తాగుతున్నారని అన్నారు. కాని వారే యదార్థంగా జరుగుచున్నది చూచినట్లైతే, ముందుకంటె ఇప్పుడు 4 రెట్లు, ఎక్కువగా త్రాగుచున్నారని వారు గమనించవలసియుంటుంది. ఈనాడు మన ప్రజలలో ఒక గృహపరిశ్రమ బాగా అభివృద్ధిపొందుతున్నదంటె, అది ఈ దొంగ సారాయి కాచేటటువంటి పరిశ్రమ మాత్రమే. ఈనాడు ఒక వ్యాపారం బాగా అభివృద్ధి చెందుతున్నదంటే, అది ఈ దొంగ సారాయి వ్యాపారమే అని చెప్పవలసియుంటుంది. దీనివల్ల లంచగొండితనము ఎక్కువై పోయింది. అంతేకాకుండా, ప్రభుత్వ శాసనాలంటే భయములేకుండా, వాటిని ధిక్కరించడం నేర్చుకొన్నారు. ఈ రోజున ప్రజలు ఏ శాసనాన్ని ఎక్కువగా ధిక్కరిస్తున్నారంటే ఈ శాసనాన్నే అని చెప్పవలసి యున్నది. ఆఖరుకు జైళ్ళకు పోవాలన్నా భయపడుటలేదు. ఏదో అత్తవారింటికి పోయినట్లు భావించుకొంటూరు. కనుక .ఈ విషయాన్ని వ్యక్తిదృష్ట్యా లేక సామాజికదృష్ట్యా, లేక దేశ దృష్ట్యా, ఏవిధంగా ఆలోచించినప్పటికిని, ఇది నిరుపయోగమైందని నష్టదాయకమైందని రుజువగుచున్నది, అంతే కాకుండా రాజకీయంగా చూచినప్పటికిని ఆర్థికంగాను, నైతికంగాను, శరీరారోగ్యరీత్యా కూడ ఇది ఒక విపరీ

మాలిన చట్టమని రుజువగుచున్నది. క్రిష్ణమరాజా బహాదూర్ గారు ఆరోగ్యశాస్త్రరీత్యా కల్లు చాలా మంచిదని చెప్పారు. గాంధీగారు కూడ తను "Diet of dieties" అనే గ్రంథములో నీరా శరీరానికి మంచిదని చెప్పారు. ఇప్పుడు కల్లుకు permission ఇవ్వకపోయినా నీరా అనే పేరుతోటి కొద్దిచోట్ల allow చేస్తున్నారు. నీరా అని చెప్పడానికి ఆచరణలో పుల్లకల్లు త్రాగుతారు. ఈ విధంగా ఉండేటప్పుడు ఈకల్లుకు నిషేధ మెందుకో తెలియడంలేదు. ఈ చట్టాన్ని సక్రమంగా అమలు జరుపలేకపోవడానికి ముఖ్యకారణం లంచగొండితనము ఎక్కువైనందు వల్లనే అంటూ ఆవిధంగా దీనిని సరిగా అమలు జరుపలేకపోయినప్పుడు వదలుకొనేదే మంచిదని మనవిచేస్తున్నాను. అసలు ఈ మద్యనిషేధ చట్టాన్ని తీసుకురావడానికి కారకులు రాజాజీయే. అదేవిధంగా ఈ నూతన విద్యావిధానానికి కారకులు రాజాజీయే. రాజాజీ ప్రభుత్వనుంచి ఆంధ్రప్రభుత్వము ఆంధ్రప్రజలు బయటబడ్డా, వారి శిష్య పరమాణువు శ్రీ బలుసు ప్రభాకర పట్టాభిరామరావుగారు వారిఛాయగా మన వెంటనే వున్నారు. వారు ఈనాడు మనప్రభుత్వంలో యీ మద్యశాసనం విద్యావిధాన బాధ్యతలు కలిగివున్నారు.

మన విద్యాశాఖామంత్రి పట్టాభిరామారావుగారు రాజాజీగారి శిష్యులలో ఒకరు. అందుచేతనే రాజాజీగారి ఆశయమైన ఈ మద్య నిషేధ చట్టాన్ని ఈ మంత్రివర్గంమీాద ప్రజలమీాద రుద్దడం జరుగుతోంది. "సాధారణంగా ప్రకాశం పంతులుగారు ఏపనినైనా చాలా ధైర్యంగా చేస్తారు" అని అంటారు. ఈ విషయంలో వారేమీా ఖచ్చితంగా చేయలేకపోయారు! అంటే రాజాజీగారు వేసిన సంకెళ్ళనుండి ఆయనకు యింకా విముక్తి కల్గలేదన్నమాట. ఇప్పుడు మద్యనిషేధ చట్టమును అమలుపరచుటకు మన ఆంధ్రదేశంలో ప్రజానీకం ఎంత మాత్రం ఇష్టంగాలేదు. ఈ చట్టంవల్ల బీదప్రజలకు అనేకమందికి పనులు లేక నిరుద్యోగులై చాలా బాధలు పడుతున్నారు. ఇప్పుడు మన రాష్ట్రంలో ఎక్కువ అమ్మోనియా సల్ఫేట్ వేసి కాచే కృత్రిమసారాయి తయారుచేయబడుతున్నది. ఇదివరలో త్రాగుడు అలవాటున్నవారంతా ఇపుడు ఆ అమ్మోనియా సారాయిని త్రాగుతున్నారు. అందువల్ల వారికి శారీరకంగా అనేక రోగాలు వస్తున్నాయి. ప్రభుత్వోద్యోగుల్లో లంచ గొండి తనాలు హెచ్చుతున్నాయి. ప్రభుత్వమునకు వచ్చే ఆదాయమూ చాలా తక్కువయింది. ఈ మద్యపాననిషేధ చట్టంవల్ల బీదప్రజలే చాలా ఇబ్బందులు పడుతున్నారు. త్రాగుడుకు అలవాటుపడిన బీదవారు దొంగ తనంగా అమ్మే అమ్మోనియా సారాయి త్రాగడంవల్ల ఆరోగ్యం పాడవ

డం; ప్రభుత్వోద్యోగులకు పట్టుబడడం; జరుగుతోంది. దీనివల్ల కల్లు గీతవల్ల బ్రతికేవారు అనేకమంది ఇప్పుడు వృత్తులులేక, జీవనోపాధి లేక కుటుంబాలతో చాలా విషాదకరమైన పరిస్థితిలో నున్నారు. ఇది అన్ని విధాలా పేదవారికే చాలా నష్టదాయకమైనది. డబ్బున్నవారు రహస్యంగా విదేశ సారాయిలను తెప్పించుకోవడం జరుగుతుంది. ఈ విదేశ సారాయి దిగుమతి వ్యాపారం రహస్యంగా జరుగుచున్నది. ఈ విదేశ సారాయివ్యాపారంలో మన Prohibition శాఖ మంత్రిగారికికూడా బొబ్బిలిరాజాగారితో జాయింట్ ఉన్నదని చెప్పుకొనేవారు. ఇప్పుడు కూడా ఉన్నదా? విదేశ సారాయి వ్యాపారంతో సంబంధంఉంటే వారు ఎందుకు ఈ చట్టాన్ని ఇంకావుంచారు అని నేను అడుగుతున్నాను. ఎలాగైనప్పటికీ దేశంలోని ప్రజలు దీనికి వ్యతిరేకులు, యీ పరిస్థితిలో దీనిని తీసివేసినట్లయితే అనేకలాభాలున్నాయి. యీ మద్యనిషేధ చట్టం మంచిదే అయినా ప్రజలకు యిష్టంలేకపోతే సరిగా అమలుజరగడం అసంభవం. ఇది సక్రమంగా అమలుజరగడమూలేదు. బీదప్రజలు అనేకమంది చాలాకష్టాలూ పడుతున్నారు. ప్రభుత్వాదాయం తగ్గింది. ఇంతే కాని, దీనివల్ల వేరేప్రయోజనంలేనట్టు కన్పిస్తోంది. అందువల్ల ప్రభుత్వం దీనిని యీ సమావేశంలోనే రద్దు చేయాలని మనవిచేస్తున్నాను.

Sri B. GANGAYYA NAIDU :—ఉపాధ్యక్షా! ఈ మద్యపాన నిషేధచట్టమును రద్దుచేయవలసిందనిచెప్పి లోగడ అనేకసార్లు శాసనసభలో నేను మనవిచేసియున్నాను. ఈచట్టమునకు ఆంధ్రరాష్ట్ర ప్రజలెల్లరూ వ్యతిరేకులే. ఈచట్టంవల్ల బీదప్రజానీకము చాల నష్టముల పాలౌతున్నారు. అందువలననే ఈ చట్టం సరిగా అమలుజరగకుండా ఉన్నది. ఒకచట్టమును అమలుజరిపినట్లైతే అది అందరిప్రజలకు ఇష్టమైనదై సక్రమంగా అమలుజరిగేటట్లు చూడాలి. ఈచట్టం సక్రమంగా అమలుజరగడంలేదు. ప్రభుత్వం ఈ మద్యపాన నిషేధచట్టాన్ని ప్రవేశపెట్టారేకాని అది ఎంతవరకు సక్రమంగా అమలుజరుగుతుందో ఎంతమంది ఆ చట్టమునకు అనుకూలంగా నడుచుకుంటున్నారు? ప్రజలు దీనికి సుముఖంగా ఉన్నారా? వ్యతిరేకంగాఉన్నారా? ఇందులో ఎవరెవరికి ఏయే విధమునైన నష్టములున్నాయనే టటువంటి విషయాలనుగురించి ఆలోచించాలి. ఈచట్టమును అమలుపరచుటవల్ల అనేకమంది కల్లుగీత వృత్తిగాగలవారు జీవనమునుగడుపుటకు చాలాకష్టపడుతున్నారు. వారు ఇపుడు నిరుద్యోగులైయున్నారు. దేశంలో ఈచట్టంవల్ల నిరుద్యోగ సమస్య ఇంకా ఎక్కువైపోయింది. వీరందరికీ ప్రభుత్వం ఉద్యోగాలిస్తామనీ, సాగుచేసుకొని బ్రతకడానికి బంజరుభూములను యిస్తామని, ప్రభు

త్వంవారు వాగ్దానంచేసినారు. ఆవాగ్దానం ఇప్పుడేమైంది. ఇప్పటికీవారు ఏమీ పనిలేకుండానేవున్నారు. వారికి ఇతరఉద్యోగాలిచ్చిగాని, బంజరు భూములనిచ్చిగాని, ప్రభుత్వం వారి వాగ్దానమును నిలబెట్టుకొన్నట్లు కనబడదు. యీనాడు పల్లెలలోకికనుక వెళ్ళిచూచినట్లైతే అక్కడిప్రజలు వృత్తులులేక ఎంత దురవస్థలోఉన్నారో తెలుస్తుంది. ఇది మధ్యతరగతి ప్రజలకుమాత్రం కొంచెం లాభదాయకముగాఉన్నది. ఇంతవరకు త్రాగుడుకు అలవాటుపడినవారు ఇపుడు సారాయి దొరకనందువల్ల అమోనియమ్‌తో తయారుచేయబడిన సారాను త్రాగుచున్నారు. ఇదిమామూలు కల్లుఖరీదుకంటె ఎక్కువ. ఆరోగ్యానికికూడా చాలా భంగకరంగా కూడా ఉన్నది. అమోనియాసారా త్రాగడంవల్ల...... అనేజబ్బు చేస్తున్నది. ఆ అమోనియాసారావల్ల వారి శరీరారోగ్యం చెడిపోయి, నానా బాధలుపడుతున్నారు. వారికి ఇదివరకటికంటె ఎక్కువడబ్బు ఖర్చు కావడం, ఆరోగ్యం చెడిపోవడం, అనవసరంగా prohibition ఉద్యోగులకు పట్టుపడడం జరుగుతోంది. ఇదివరకుకంటె యీనాడే వారికి బాధలెక్కువగాఉన్నాయి. యీ మద్యనిషేధంవల్ల ప్రజానీకము కొంచెమైనా సుఖపడలేదుసరికదా చాలా దురవస్థలపాలవుతున్నారు. మనరాష్ట్రంలో prohibition ఉద్యోగులు ప్రతిగ్రామంలోనూ యీ మద్యనిషేధచట్టమును సక్రమంగా అమలుజరపడానికి ఎంతవరకు తమబాధ్యతలను నిర్వహిస్తున్నారోఅన్నది మనప్రభుత్వం ఆలోచించవలసియున్నది. ఇపుడు prohibition వుద్యోగులు చాలామంది లంచగొండులైపోయారు. వారు గ్రామములలో కొన్ని సారాకేసులుపట్టుకున్నా అందులోకొన్ని కోర్టుకురాకుండానే మధ్యనే పోతూవుంటాయి. ఇది ఎందువల్ల జరుగుతున్నదిఅంటే అవతలివారు ప్రభుత్వోద్యోగికి లంచమివ్వడమో యేదో జరుగుచున్నది. ఒకవేళ కొన్ని కేసులు కోర్టుకువచ్చినా అందులో100 కేసులకు ఎన్ని నెగ్గుతాయో, అదికూడా మనప్రభుత్వంవారు చెప్పవలసినదే. ఆ కేసులుపెట్టడంవల్ల ప్రభుత్వానికి డబ్బు ఖర్చేగాని, అంతకంటే వచ్చేదేమీలేదు. యీprohibition వల్లప్రభుత్వానికి చాలా ఖర్చు హెచ్చినదితప్ప ప్రజానీకంలో prohibition వల్ల యేమీ చెప్పుకోతగినంత మార్పేమీలేదు. యీ prohibition శాఖక్రింద ప్రభుత్వానికి చాలా ఖర్చుఅగుచున్నది. ఆ కేసులలో పట్టుబడినవారికి 10రూపాయలు, 25రూపాయలు జరిమానా వేయడం జరుగుతున్నది. prohibition వుండడం మనరాష్ట్రంలోని ప్రజలకు యేమాత్రం ఇష్టంలేదని. దానివల్ల ప్రజలకు ప్రభుత్వంమీద గౌరవంపోతుందని. [illegible] అనేక సార్లు [illegible] [illegible] వల్ల [illegible] [illegible] [illegible] చాలా [illegible] కష్టపడు

తున్నారు. యేజన్సీప్రాంతప్రజలకు నల్లమందుఅలవాటు. అలవాటున్న వారికి పర్మిట్లుఇచ్చేవారు. వారికి తాలూకాఆఫీసులలో తాసిల్దారుగారు యిచ్చేవారు. యిప్పుడు ఆ పర్మిట్లను D. M. O. గారివద్దకు వడితేగాని యివ్వడంలేదు. యేజన్సీప్రాంతప్రజలు చాలాదూరంనుంచి యీపర్మిట్ల కోసం రావలసియున్నది. వాళ్ళు కనీసం 20, 30 మైళ్ళు దూరంనుంచి రావలసియున్నది. ఇంతదూరంవెళ్ళలేక చాలమంది ముసలివారు ప్రాణములనుకూడా కోల్పోవుచున్నారు. నల్లమందు అలవాటున్నవారు, అది వేసుకోడం మానివేసినట్లైతే వారి శరీరారోగ్యంచెడిపోయి అనేకజబ్బులు వస్తాయి. అందుచేత వారికినల్లమందు లోగడవలెనే తాలూకా head-quarters లోనే permits యిచ్చుటకు యేర్పాటుచేయించవలయును. ప్రభుత్వం యీ విషయములన్నింటినీ సక్రమంగా ఆలోచించి prohibition వెంటనే రద్దుచేసి పేదప్రజల ఆర్థికస్థితి బాగుచేయాలని నేను మనవిచేస్తున్నాను.

(At this Stage the Speaker resumed the Chair)

*Sri KAVALI NARAYANA :—అధ్యక్షా! మద్యపాన నిషేధ చట్టమును రద్దు చేయ కూడదా? రద్దుచేయ వచ్చునా? అను విషయంపై రెండు ప్రక్కల సభ్యులుకూడా మాట్లాడారు. చాలామంది ఈ చట్టాన్ని రద్దుచేయాలని చెప్తూ వచ్చారు. నా ఉద్దేశ్యంలో మాత్రం ఈ మద్యనిషేధ చట్టమును రద్దుచేయడం చాలా మంచిపని అని ఈ మద్యపాన నిషేధ చట్టం ప్రజలకు చాలా మంచిదని అన్నారు. నిజంగా అది సక్రమంగా అమలు జరిగితే చాలామంచిదే. కాని అది సరిగా అమలు జరగనందువల్ల దేశంలో పేద ప్రజలు దీనివల్ల చాలా బాధ పడుతున్నారు. ఈ మద్యపాన నిషేధ చట్టం పేదప్రజలకు అసలు లాభదాయకముకాదు. ఇపుడు ఇది గ్రామములలో ఉండే village మున్సిఫ్‌లకు, విలేజ్ కరణములకు, గ్రామంలో ఉండే కొంతమంది పెద్దలకు మాత్రమే ఇది లాభదాయకము. కాని ఇది పేదప్రజలకు ఏమాత్రం లాభంలేదు. పల్లె ప్రాంతాలలో ఇది వరకు గీతపని చేసుకొనేవారు యిప్పుడు నిరుద్యోగులై యున్నారు. వారు చాలా కష్టపడుతున్నారు. ఇవుడు ప్రజలు కల్లుకాని, సారాకాని దొరకక చెరకు తోటలలో బెల్లము తయారు చేసేచోట అమ్మోనియంతో తయారు చేయబడిన సారాను ఎక్కువ డబ్బు ఖర్చుపెట్టుకొని త్రాగుతున్నారు. దీనివల్ల వారు చాలా అనారోగ్య స్థితికి వచ్చుచున్నారు. ఈ మద్య నిషేధమునకు సంబంధించిన ప్రభుత్వోద్యోగులు లంచగొండులై పోతున్నారు. అందువల్ల ఈ మద్యనిషేధ చట్టం సరిగా అమలు జరుగక

అరాచకము ఏర్పడు చున్నదని చెప్పవలసి వస్తుంది. అచ్చటచ్చట గ్రామాలలో ప్రభుత్వోద్యోగులు, సారాయి తయారుచేసి డబ్బు సంపాదించే డబ్బున్న వారివద్ద లంచములు తీసుకొని వారిని ఏమీ చేయకుండా, ఆ సారాను త్రాగిన పేదప్రజలపై కేసులుపెట్టి బాధ పెట్టడం జరుగుతోంది. ఈ మద్యనిషేధంవల్ల డబ్బున్న వారికే కాని, పేదవారి కేమీ లాభంలేదు. అన్ని విషయములలోనూ పేదవారికి అన్యాయం జరుగుతోంది. ఒకచోట తయారుచేసిన అమోనియా సారాయి కావిడిలో పెట్టుకొని ఇంకొక చోటికి పట్టుకువెళ్ళే బీదకూలివానిని పట్టుకొని వానిని కోర్టులోపెట్టడం, 200 రూపాయలు జరిమానా వేయడం జరుగుతోంది. కాని, ఆ సారాయి ఎక్కడినుంచి వచ్చుచున్నది ? ఎవరికి చెందినది ? అనేటటువంటి విషయమును ఆలోచించ కుండానే ఆ పేద కూలి వానిని పట్టుకొని హింసించడం జరుగుతోంది. ఈ మద్య నిషేధం బీదప్రజానీకమునకు ఏమీ లాభంలేదు సరికదా వారే దీనివల్ల చాలా బాధలు పడుతున్నారు. ఈ విషయాలను నేను ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తూ దీనిని రద్దుచేయాలని కోరుతున్నాను. ఇంక court కు వెడితే అక్కడ డబ్బుగల వారినే చూస్తారు. హాలో ! మిష్టరని shake hand ఇచ్చి బుజ్జగించడం జరుగుతుంది కాని, బీదవాడు వాడుమంచివాడైనా, చెడ్డవాడైనా ఒకటే. ఈ కోర్టులలో జరిగే విషయాలు ఏమీ బాగుగా లేవు. ఈ మద్యపాన నిషేధం ఈ బీదప్రజానీకానికి మంచిదనే పెట్టారు పెద్దలు. గాంధీజీగారి సిద్ధాంతాలు అన్నీ మంచివేకాని ఆయన సిద్ధాంతాలు ఈనాడు చెల్లుబాటులో లేవు. అది మా దురదృష్టం. గాంధీగారు హరిజనుల కోసం 21 రోజులు ఉపవాసం చేసి, తపస్సు చేశారుగాని, ఇది పెద్దవారికే వర్తిస్తుంది తప్ప, చట్టం ఎంతమంచిదైనా, దానిలో చెడ్డ విడిచిపెట్టిమంచి అమలులోకి తీసుకురాలేం. దాన్ని తర్జనభర్జన చేయకుండా, వెంటనే రద్దుచేయమని కోరుతున్నాను. Village లో కుక్క పిల్లిపోట్లాడితే report చేస్తారుగాని, నాప్రక్క గ్రామంలో బట్టీకి 15-0-0 లంచం పుచ్చుకున్నట్లు revenue inspector ద్వారా జిల్లా collector లకు అర్జీ పంపినాము. ఏమీ పనిజరగలేదు. ఈ ఘోరమైన చట్టం తీసేయమని ప్రార్థిస్తున్నాం.

**Sri K. VARADACHARI** :— అధ్యక్షా ! యీ మద్యపాన నిషేధచట్టం అమలులోకి తెచ్చినప్పుడు, ఈ పార్లమెంటరీ ప్రోగ్రాంలో [illegible] మనకు కొంత Constructive work చేస్తూయున్న కాలంతో, [illegible] ఉత్సాహం [illegible]. రాజ[illegible], ప్రకాశం పంతులుగారు, వారిఆధ్వర్యమున [illegible]

మొదట ఇది ప్రవేశపెట్టబడినప్పుడు మా జిల్లా రెండవ జిల్లాగా ఎత్తుకొని దాన్ని అమలులో పెట్టారు. అమోఘమైన ఉత్సాహం యావన్మందీ కూడా, ప్రజలలో అన్ని శాఖలవారూ చూపించారు. నిండా సక్రమంగా పనులు జరుగుతూ వచ్చాయి. పార్లమెంటరీ ప్రోగ్రాం దాని అనుభవం ముదరను, ముదరను ఈ నిషేధ చట్టం అమలు పెట్టడంలో ఉత్సాహం తగ్గిపోతూ వచ్చింది. పార్టీలు అనేకంగా బయల్దేరడం, అనేకవిధములైన అభిప్రాయాలు, వివిధములైన అభిప్రాయాలు పార్టీలు వెలిబుచ్చడం, దానివల్ల ప్రచారం జరగడం, ఇన్నాళ్ళుగా మద్యపాన నిషేధం అమలుజరుగుతూంటే, ఈ దినం దాన్ని నిలబెట్టగలరా అనే పరిస్థితి వచ్చింది. ఇది ఆకర్షణచేసే వస్తువులలో విశేషంగా ఆకర్షించే వస్తువు. దాన్ని అమలుపర్చడం కష్టం అనే వాదం ఒకతట్టు, ఇంకోతట్టు పేదవారిని ఈచట్టంవల్ల కాపాడుటకు ఏమి వీలవుతుంది; పేదవాళ్ళు పేదవాళ్ళే; వారు నసించిపోవలసినదే. మద్యపాననిషేధంవల్ల అమలు పడబోయేది లేదు అనే వాదం ఒకతట్టు. ఇంకొకతట్టు సర్కారుకు వచ్చే ఆదాయం అనేక కోట్ల రూపాయిలు వస్తూంటే దాన్ని ధార పోసుకోవటమా ? డబ్బులేదు. డబ్బు దీనికిలేదు, దానికిలేదు, అనే ఉత్తరములు వింటూ ఉంటాము. దీన్ని ఎందుకు అనవసరంగా పెడతారు దీన్ని తీసేస్తే అనేక కోట్ల రూపాయిలు వస్తాయి అని చెప్పే వాదం, ఇది ఎవరికీ పట్టలేదనే వాదం ఒకతట్టు. ఇట్లా అనేకరకాల ప్రచారం జరుగుతోంది. ఆంధ్రరాష్ట్రం విభజన కావడంతో ఈ ఆందోళన విశేషంగా ముదిరింది. నాకు కనిపించేటంతవఱకు ఈ ఆందోళన విశేషంగా మన శాసనసభలో జరుగుతోంది. కాని బైట ప్రజలలో ఈ విషయాన్ని గురించి ఇంత ఆందోళన ఉన్నదా అనేది పెద్దసమస్య. అర్జీలు కట్టలు కట్టలుగా వస్తూనే వుంటాయి, ఆకట్టలు మేము యెరుగనివారమా ? ఇన్ని సంతకాలతో అర్జీలు తెస్తున్నారు. మేము చాలా రోజులుగా చూస్తున్నాం యీ సంతకాలు పెట్టించడం, ఈ కోపాలు కల్పించడం ఒక కష్టంకాదు. మేముకూడా సంతకాలతో ఈ కట్టలు సమర్పించగలం, ఈ మద్యపాననిషేధం జరగవలసిందే అని కాలం మారుతోంది. ప్రజలలో విశేష ఆకర్షణీయమైన వస్తువే, దీన్ని ఆపడానికి మనవల్ల సాధ్యమవుతుందా లేదా అని విచారించవలసిన విషయమే. ప్రజాస్వామ్యపద్ధతిలో ఆలోచించిచూస్తే ప్రజల నిజమైన అభిప్రాయం తెలుసుకో వలసిన అవసరం ఉన్నది. వద్దంటే పోతుందా ? ఇది మొట్టమొదట ప్రవేశపెట్టినప్పుడు, దీని ముఖ్యతాత్పర్యం నిరుపేదల కుటుంబాలు వృద్ధిలోనికి రావాలన్న భావమేగాని, బీదలనుకొట్టి, భాగ్యవంతు

క్టరు గారిదగ్గరనుంచిగాని ఏమీచర్య లేదు. కాబట్టి Executive Officerను నియమించేఅధికారం Public Services Commissionకు వప్పగిస్తే వారు అర్హతలను విచారించి సరియైనవారినే నియమిస్తారు. ఇన్స్పెక్టరు వేసినవాళ్ళలో బొత్తిగాజ్ఞానంలేనివాళ్ళు ఒక్క కాగితంకూడా సరిగా వ్రాయలేనివాళ్ళు ఎంతోమందిఉన్నారు. ప్రభుత్వం దానిని సరిచెయ్యాలి.

రెండవసంగతి పంచాయితీలలో యెన్నికలు చేతులెత్తడంమూలంగా జరుగుతున్నాయి. అందువల్ల ఇవి నిష్పక్షపాతంగాజరగడంలేదు. రహస్య వోటింగ్ పద్ధతివుంటే భూస్వాములయొక్కగాని ఇతరులయొక్కగాని నిరంకుశాధికారానికి వీలుండదు. ఉమ్మడిరాష్ట్రంలోకూడా దీనినిగురించి చర్చించాము కాని అప్పుడు స్థానికస్వపరిపాలనామంత్రిగారు చర్యతీసుకోలేదు. ఇప్పుడైనా శ్రీతిమ్మారెడ్డిగారు దీనినిగురించి చర్యతీసుకుని రహస్య వోటింగ్ పద్ధతి అమలుజరిపిస్తారని నమ్ముచున్నాను. వారు అధికారంలోకి వచ్చాక పంచాయితీబోర్డులపరిపాలన బాగాలేదనీ, ప్రెసిడెంట్లు డబ్బు తినేస్తున్నారనీ చెప్పారు, Board of Revenue వుండడంవల్ల లంచగొండితనం పెరిగిపోతుందని దీనిని ఎత్తివెయ్యాలని కాంగ్రెస్ వారేచెప్పారు. కాని వారు అధికారంలోకివచ్చాక కూడా దానినట్లేవుంచారు. పరిపాలన పాతపద్ధతుల్లోనే జరుగుతోంది. ఏ అధికారిదగ్గరకైనా ఎవరినైనా ఒక శాసనసభ్యుడు తీసుకుపోతే M. L. A. కు మాత్రం కూర్చోవడానికిస్థానంఇస్తారు. వారితో వెళ్ళినవారు నిలుచుండవలసిందే. లంచాలిస్తే పనులు వెంటవెంటనే జరుగుతాయి లేకపోతే Acknowledgement కూడా రాదు. పరిపాలనలో Change of outlook కనిపించడంలేదు. వీటినన్నిటిని సరిచేసి పరిపాలన సక్రమంగావుండేటట్లు చేయాలని కోరుతున్నాను.

* Sri VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా! ఆంధ్రరాష్ట్ర విభజనజరిగినతరవాత మనకు ఆస్తిఅప్పులసమస్యలు అనేకం ఉన్నాయి. అవన్నీ తేలవలసివుందని, ఆస్తిఅప్పులు తేల్చుకోవాలెనని, తేల్చుకున్నవన్నీ రావాలని అనుకున్నాం. కాని ఈ విభజనకార్యక్రమం ఎంతవరకుజరిగిందీకూడా ఇంతవరకు తెలియలేదు. నష్టంజరిగినట్లు వివరంగా తెలుస్తోంది. దీనివిషయంలో ఒక మధ్యవర్తిసంఘాన్ని వేయవలెనని ఆంధ్రరాష్ట్రబిల్లు చర్చలసందర్భంలో మనంఅంతా కోరాం. కేంద్రందానిని అంగీకరించకపోయింది, చివరకు వివాదంవస్తే, రాష్ట్రపతి నిర్ణయిస్తాడని ఆంధ్రబిల్లులో నిర్ణయించారు. ఆవిషయంవెంటనే ప్రెసిడెంటుగారికిపంపిస్తే వారు విచారిస్తాంఅనిచెప్పారు. మద్రాసు శాసన

సభలో assets and liablities ను 1953 జనవరి ఒకటినుండిగాని, April ఒకటినుండిగాని లెక్కవేసి తీసుకురావాలని చెప్పాం. కాని అది జరగలేదు. బడ్జెట్‌సందర్భంలో దానివిషయమై శ్రద్ధ నా వివరించిచెప్తారని ఆశించాం అదేమీరాలేదు. కనీసం వివరాలన్నీ సంపాదించియైనా శాసనసభ్యులకు తెలియజేస్తే ఇంకా నష్టంఎంతో స్పష్టంగా తెలుసుకో దానికి వీలౌతుంది.

తరవాత తుంగభద్రాడాముదగ్గిర పనిచేసేవాళ్ళందరిని సెంట్రల్ గవర్నమెంట్ దానిచేతులోకి తీసుకుపోతున్నది కాబట్టి అన్నిరాష్ట్రాల లోనివారు ఉండవచ్చునని, సెప్టెంబరు 30వ తేదీతో ఎవరు ఉద్యోగాల్లో ఉంటారో, ఎవరుఉండరో వ్రాయాలని చెప్పారు. చాలామంది ఉద్యోగాలు అక్కరలేదని రాజీనామాలువ్రాసిఇచ్చారు. మర్నాడు మళ్ళీ ఇంకో ఉత్తరువువచ్చింది అందులో ఉన్నవాళ్ళందరూ ఉండవచ్చుని, దాంతో ఆంధ్రేతరులందరూ మిగిలిపోయారు. ఆంధ్రులంతా ఎగిరి పోయారు. దీనివల్ల ఆంధ్రులకు చాలానష్టంకలిగింది. దీనివిషయంలో మీరు ఏమిశ్రద్ధతీసుకున్నారో మాకు తెలియదు. అటువంటివిషయాల్లో ఉద్యోగాలుపోయినవాళ్ళకు ఆంధ్రరాష్ట్రప్రభుత్వం జోక్యంకలిగించుకొని వారంతా మొదటినుండీ అక్కడేఉన్నట్టుచేయాలి. ఇకఇక్కడిరాజధాని లోనిసంగతిచూద్దాం మద్రాసునుంచివచ్చినవాళ్ళకు మద్రాసులో ఒక కాపురం ఇక్కడఒకకాపురం అనిచెప్పివాళ్ళకు Deputation ఎలవెన్సు అని ఇస్తున్నారు. రాష్ట్రంలో ఇతరప్రాంతాలనుండివచ్చినవారికి ఇవ్వడం లేదు అందువల్ల ఉద్యోగాల్లో నిరాశ ఎక్కువవుతున్నది.

రాష్ట్రం విడిపోయేసరికి ఎక్కడవుండే స్టోర్సులు సామానులు వాళ్ళవేఅన్నా దీనివల్ల చాలామోసంజరిగిందిఅనుకుంటున్నాను. మేము అనేకసార్లు అనేకప్రశ్నలుపంపించాం. కాని ఒక్కప్రశ్నకు సమాధానంపంపించలేదు. విభజన సక్రమంగాజరగలేదు. మాకు information చెప్పకపోయినాసంతోషమే. ఇన్‌ఫర్మేషనుసేకరించి రానున్న బడ్జెటు నాటికన్నా అందజేయవలెనని కోరుచున్నాను. గవర్నరుగారు జీతం తగ్గించుకొన్నారన్నారు చాలాసంతోషం. కాని మంత్రులజీతాలు తగ్గించుకోడానికిమాత్రం ఆయన వ్యతిరేకిస్తున్నారు, అది తిరిగి శాసన సభకు పంపిస్తున్నారని పేపర్లలోపడింది. అది అబద్ధంఅయితే చాలా సంతోషిస్తాం. గవర్నరు దాన్ని మళ్ళీపంపించి పరిశీలించటమనటం చాలా అన్యాయం తనజీతం తగ్గించుకున్న గౌరవాన్నికూడా పోగొట్టుకున్నవా రవుతారు.

ఇదివరకు ప్రతిసంవత్సరం ఆంధ్రదేశంలోఉన్నటువంటి గ్రంథాలయాలకు కొంతడబ్బుఇస్తుండేవారు. ఆంధ్రరాష్ట్రంరాగానే గ్రంథాలయాలకు ఇచ్చేడబ్బుఆపుచేశారు. ఎవరాపుచేశారనిఆశాఖలముఖ్యుల నడిగితే మరొకరిని అడగమంటున్నారు! ఇది ఏశాఖకు సంబంధించినదో మరిగాకు బోధపడడంలేదు. అందుచేత ఏటాఇచ్చేడబ్బు వెంటనే ఇచ్చే ఏర్పాటుచేయవలెనని కోరుచున్నాను. తరవాత మనకు ఆంధ్రదేశం మొత్తానికి Central library అనేదిఏర్పడ్డం చాలాఅవసరం అందుకు వెంటనే ఆంధ్రప్రభుత్వం కృషిచేయాలి. అంతేకాదు గ్రంథాలయాల లోపంవల్ల యేర్పడవలసిన రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాన్ని త్వరలో ఏర్పరచవలెననికోరుచున్నాను.

మన ఆంధ్రదేశంలో భూగర్భసంపద ఎక్కువగాఉంది. ఈభూగర్భ పరిశోధనచేసినప్పుడు మనదేశంలో ఏసంపదఉన్నదో, దాన్ని ఎలాఉపయోగించాలో ఆలోచించడంకోసం నిపుణులను నియమించమని దానికోసం భూగర్భ పరిశోధనశాఖను ఒకదాన్ని వేయమని కోరుచున్నాను. ఈవిషయంలో సెంట్రల్ గవర్నమెంటుకు వ్రాయమని చెప్పుతున్నాను. అప్పుడు ఈ ఖనిజసంపదే నిజమైన మన ఆంధ్రసంపద అవుతుంది. అదేనిజమైన ఆంధ్రశక్తి అవుతుంది.

తరవాత ఈ డిపార్టుమెంట్సులో చూస్తూచూస్తూ అమాంతంగా కొత్తకొత్త ఉద్యోగులను వేస్తున్నారు. రోజురోజుకు ఒక కొత్తఉద్యోగి కనిపిస్తున్నాడు. ఉద్యోగాలుఇస్తే ఇవ్వండిగాని, వీళ్ళచేత సక్రమంగా సమర్థతతో పనిచేయించమని కోరుతున్నాను. అందరూకలిసి సమర్థ పరిపాలన చేయాలి. మంత్రివర్గం ఉండచ్చు పోవచ్చు; గవర్నరు పరిపాలనరావచ్చు. అంచేత ఇప్పుడుఉండేగుమాస్తాలకు సంతృప్తికరమైన అవకాశమిచ్చి వారికి పనికల్పించి ఆంధ్రరాష్ట్రంలో సమర్థమైన పరిపాలననడపడానికి ప్రయత్నంచేయమని కోరుతూ, మంత్రులుమాత్రం తిరిగి 500రూపాయలకుపైన ఆశించవద్దని కోరుచున్నాను.

Sri K. V. RAMESAM:—అధ్యక్షా! ఈ డిమాండ్‌ను బలపరుస్తూ నేను ఒక సూచనను చేస్తున్నాను. సుమారు 40 సంవత్సరములనుండి ఈ రాష్ట్రాన్ని సాధించడానికి అనేక ప్రయత్నాలు చేసినది అందరికీ తెలిసిన విషయం. ఈ ఉద్యమం ఎందుకు బయలుదేరిందంటే ఆంధ్రులకు చాలా అన్యాయం జరిగిందనే విషయం కారణం అయి వుంటుంది. అదే శాసన సభ్యులు అందరికీ తెలిసిన విషయమే. ఈ విషయంలో మన పార్టీవారు [illegible] న్యాయం [illegible]

(Sri C. Subbarayudu)

వారికి extention యివ్వడము సబబుకాదు. వారు ముఖ్యంగా యీ ప్రాంతాలవారై పని efficientగా చేయడానికి వీలు వుంటుంది అంతేకాకుండా ఈనాడు బళ్లారిజిల్లాలో ఆంధ్రులుగావున్న ఉద్యోగులు Local Administration Department నుండి పంపివేస్తున్నారు. ఈ విషయాలన్ని యిప్పుడు నాదృష్టికి వచ్చినవి. అంతేకాకుండా Police Departmentలో 30,35మంది ఉద్యోగులుఆంధ్రులనే నెపంతో ఆంధ్రరాష్ట్రానికి వచ్చారు. ఆంధ్రులంటే యే definition యిచ్చారు? ఇక్కడ ఉండేవుద్యోగులు తెలుగువారు promotion విషయములో వెనుక పడుతున్నారు. ఆంధ్రులుకానివారు ఆంధ్రులనే నెపంతో యిక్కడ వుంటున్నారు. ఇతర ప్రభుత్వాలనుండి ఇక్కడకురావడం జరుగుతున్నది. దయచేసి వారిని గురించి ఆలోచించి యిప్పుడు తగు చర్య తీసుకోవాలి అని కోరుచున్నాను. ఇప్పుడు బళ్ళారిజిల్లాలో ఆంధ్రవుద్యోగులు యింకావున్నారు. ఇతరజిల్లాల్లోకూడా వున్నారు. వారందరికికూడ ఆంధ్రరాష్ట్రములోనే వుద్యోగాలు కల్పించే అవకాశము యివ్వాలి. Bellary Politechnic Department ఆఫీసరు, Textile Industries Director వున్నారు. ఉద్యోగస్తులు చాల మంది తిరిగి వస్తున్నారు. వారు యిప్పుడు వున్నతవిద్యను అభ్యసించడానికి Scholarships యిస్తామని వచ్చింది. ఐతే వారు మైసూరు ప్రభుత్వానికి తెలియబరిస్తే వారక్కడ యివ్వనందువల్ల వారు ఆంధ్ర ప్రభుత్వానికి తెలియబర్చుకున్నారు. ఈ విషయము నాదృష్టికి వచ్చింది కనుక నేను చెబుతున్నాను. ఈ విధంగా వారు ఆంధ్రులని, వారి సర్వీసు 31st Dec. 53 వరకు ఉన్నప్పటికి వాపు తేల్చి చెప్తున్నారు. మన ఆంధ్రులు యితరరాష్ట్రాలలో పనిచేస్తున్నారు. వారికి వీలున్నంత వరకు ఏదో విధంగా మన రాష్ట్రములోనే వుద్యోగములు యిచ్చిన యెడల వారు మన ఆంధ్రరాష్ట్రాభివృద్ధికి తోడ్పడుదురని తెల్పుచున్నాను. కాబట్టి వీలైనంత త్వరలో పంపించడానికి ప్రభుత్వాన్ని కోరుచున్నాను. ముఖ్యంగా Confidential seats ను గురించి ఎక్కువగా నేను ఫాల్సు అని చెప్పకతప్పదు. కష్టపడి ఒక నీతినియమంతో పనిచేసేవారు అక్కడ వున్నవారే యిక్కడా వున్నారు. మదరాసు రాష్ట్రంలో మన ఆంధ్రులకు అన్యాయం జరుగతున్నది. మదరాసు రాష్ట్రంలో వారు న్యాయంగాను ధర్మంగాను పనిచేసినప్పటికిని Seniority overlook చేసి promotion యివ్వకపోవడము జరుగు తున్నది. [illegible] over look చేశారు గనుక యిప్పుడు [illegible] [illegible] ప్రభుత్వంలో యివ్వవలసిందిగా కోరుచున్నాను కాబట్టి [illegible]

confidential అనే పదమును తొలగించి అన్ని పనులు తెలియచేస్తే ఆయా శాఖలు action తీసుకోవచ్చును. కాబట్టి అందరికీ ఉద్యోగస్తులలో న్యాయముగా confidential seats అనే టటువంటివి ఉద్యోగస్తులకు ఇవ్వబడక సడలించ బడాలి.

ఈ Agirculture Department లో ఒక డిమాన్‌స్ట్రేటరు 18సంవత్సరాలుగా serviceలోవున్నారు. 4, 5 సంవత్సరాలు service చేరినవారు Agriculture Officers గా కానడము నాకెంతో విచారిస్తున్నాను. మంత్రిగారు దృష్టికి యివన్నీ తీసుకునిరానడము తెలియచేయుచున్నాను. రెండుమూడుసార్లు application పెట్టుకున్నారు. నాకు ముఖ్యంగా తప్పుచేశారన్నారు. ఏమి తప్పుచేశారని అడిగితే దానికి జవాబు ఇంత వరకు రాకుండా వున్నది. అటువంటివి ఎన్నో అన్యాయాలు జరుగుతున్నవి. కాబట్టి ప్రభుత్వము దృష్టిలోకి తీసుకుని వారి grievances విచారించి తగిన చర్య తీసుకుంటారని భావిస్తున్నాను.

ఇటువంటి విషయాలలో ప్రభుత్వోద్యోగులకు న్యాయముగా పనిచేసేవారికి బాధలు కలుగకుండా వారికి రావలసిన promotion యివ్వడానికి తగిన చర్యలు తీసుకోమని ప్రభుత్వానికి నేను మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

Sri G. NAGABHUSHNAM :— Sir, In a Democratic set up the problem of Public servants.

Sri T. NAGI REDDI — On a point of order, Sir. ఎసెంబ్లీలో రానురాను యింగ్లీషులోనే ఎక్కువగా మాట్లాడుతున్నారు. ఆంధ్రరాష్ట్రము వచ్చినప్పటికి దీనిని ఇంగ్లీషు ఎసెంబ్లీగా తయారుచేస్తున్నారు. దీనికి కారణము ఏమిటో చెప్పి ఆపైన ఉపన్యాసములు చేస్తే బాగుంటుంది.

* Sri G. NAGABHUSHANAM :—నాకు తెలుగు బాగా వచ్చును. వ్రాయనూ గలనుకూడా. ఐతే తొందరగా తెలుగులో మాట్లాడుటకు నాకు ఆటంక మవుతుంది. నేను తెలుగు చాలా చదువుకొన్నప్పటికి ఇంగ్లీషులోనే బాగా మాట్లాడగలను. కనుక క్షమించి నన్ను ఇంగ్లీషులో మాట్లాడ నివ్వండి.

In a democratic set-up, the public servants play a very imortant part. For instance, in France the stability of the Ministers is a rare instance and it

is only the public servants that have been carring on the administration and with great efficiency. Mr. Price points out in his book on modern democracies that administration that is being carried on in Switzerland and Great Britain is the best. In these two democracies the public service is excellent and honest and very efficient. So far as the Andhra State is concerned we must also strive to see that the public servants carry on the administration very efficiently and honestly and I also say, without any offence to anybody, they are expected to be polite to the public. The public servants should change their attitude towards the public. When an ordinary ryot approaches the Collector, the latter has to receive the former politely and hear his complaints patiently. This kind of sympathetic attitude is now lacking. Among polite servants another thing that is lacking in the public services is co-ordination and co-operation between the several departments. That is the reason why several complaints are made in respects of the extraordinary delay in giving replies to the questions put to them. The head of each department thinks that he is the biggest man and he does not want to go and speak with the head of another department. The Chief Minister and the Revenue Minister should see that the Revenue Secretary and the Home Secretary carry on the administration in a friendly way. It is only the public servants that can really do good service to the people, since it is they who carry on the administration from day-to-day. Therefore, it is necessary that we must maintain an efficient public service.

Then, Sir, within the short time at my disposal I must congratulate the Andhra Ministry on the broad policy in regard to the food problem. They have removed all restrictions and they have declared that any ryot can sell his paddy or his millets, without any let or hindrance anywhere he pleases. This is a policy which I very much appreciate. I must also congratulate the Minister for Local Boards for not only

granting 11 lakhs of rupees to Anantapur district but also on exempting the weavers from paying the house tax, property tax and profession tax. Indeed it is a great relief to the distressed weavers. Again the Revenue Minister is pleased to extend the duration of the gruel centres now existing for the benefit of the weavers since their plight is miserable.

With regard to the export and import policy of the Andhra State, I am very glad that the Minister has given relief to the people living in the border areas like Rayadrug. They have permitted the people of Rayadrug to export their puffed rice to Bellary.

I am also thankful to the Law Minister for his sympathetic attitude to the aspirations of the Adoni people as well as the Rayadrug people in granting the location of the courts of justice.

I now come to the question of the Taccavi loans which has been causing great dissatisfaction among the ryots. A large population of ryots are undergoing several hardships. If a ryot wants to apply for a loan of Rs. 500 at last he gets only Rs. 300, as he has to pay mamools for the revenue peon up to the Tahsildar. On several occasions I have filed petitions both at Bellary and in my place bringing specific instances of corruption that is existing in regard to distribution of Taccavi loans. I intend to make a suggestion that the Tahsildars hereafter should not be allowed to distribute the Taccavi loans but the district Collectors alone should be made responsible for the distribution of Taccavi loans and he should be personally liable for any mistake. It is impossible for the ryot to get the full amount without parting at least a small amount of money for the village munsiff and karnam. That is a problem which the Minister has to solve, and how to get over the difficulty of the Reddy and the karnam who are all-powerful in the village. Of course, we can get over the difficulty of the revenue inspector and the Tahsildar by taking away the Taccavi loans distribution from their control. But it is difficult to escape poor ryot from the clutches of village munsiff and karnam,

I now come to the subsidies for wells and extension of the well subsidy scheme in the Andhra State. The Andhra Government have not made so far any announcement in regard to sinking of wells. Wells do play a very prominent part in the improvement of the agriculture and production of food and particularly it applies to the Anantapur district, the parts which are not covered by major irrigation projects. It is therefore necessary that we should encourage the ryots to sink wells and also supply electricity in aid of grow more food compaign.

I am very glad that the only taluk in which electricity is given to the villages in Andhra Desa is Rayadrug Taluk.

I can tell the hon. Members that the ryots there are very enthusiastic in carrying on the agricultural operations as the electricity gives necessary momentum for development of agriculture.

In this connection I wish to remaind Mr. Sanjiva Reddi, Public Works Minister to remove the voluntary loan system. That is one thing that is blocking the way. Even to this day the Heads of departments have not received any written order to the effect that the voluntary loan system has been dropped. I hope the Public Works minister would remove the voluntary loan system now existing and pave the way for the expansion of the electricity in rural areas. The expansion of electricity is more important than even the conducting of big projects because the supply of electricity will not only augment the food production but will also improve the rural industries and will confer the benefit immediately. The big irrigation projects take years for completion whereas extension of electricity will confer immediate benefits on ryots.

As regards the Public Works Department, I agree with Mr. C. Rajagopalachariar the Chief Minister of Madras State that the P. W. D. is enemy No. II, because I have seen in several villages in my taluk where the estimate prepared was much higher than

the actual cost incurred. I have seen myself and examined such things and I found that the reports of the Department have been misleading and I reported the matter to the authorities. The supervisors and the contractors and the middlemen combine together to dupe the Government. Therefore, I request the Ministry very respectfully to examine all the estimates sent by the P. W. D. very carefully. I suggest that in this matter a committee of officials and non-officials might be appointed to examine all the estimates. Large sums of money are Sometimes misspent and therefore there is no reason why there should be close scrutiny. The Andhra State with its already slender income and deficit budget should see that large sums of public money are not misspent and I appeal to The Hon. Sri Viswanatham Minister for Finance to see that the estimates are not accepted unless they are properly scrutinised and examined by a competent body. Supervision of the work on the spot is necessary when work is executed. In this way we can put a stop to the public waste that is going on since a long time in the Public Works Department.

Sri G. BAPANAIAH:— 'అధ్యక్షా! నాముందు సభ్యులు శ్రీ వెంకట సుబ్బారెడ్డిగారు మాట్లాడుతూ totalitarian course కన్నా యీ ప్రజాస్వామ్య సూత్రాల ప్రకారము చేస్తున్నదానిని, దాని సందర్భాన్నిబట్టి వాటితో దిద్దుకొనటానికి అధికారము ఎక్కడ వుంది ? గవర్నరు యీబిల్లును త్రిప్పి పంపడానికి అధికారము వున్నదా లేదా అని ఆలోచించాలి అని మిత్రులు చెప్పారు. గవర్నరు శాసన సభకు యీ బిల్లును త్రిప్పి పంపడానికి స్వాతంత్రం లేదు, నేను చెప్పేది ఏమిటంటే మంత్రులకు 500 రూపాయలు వుండటం చాలునని మావుద్దేశ్యం. కారణం ఏమిటంటే మన దేశములో జీవన ప్రమాణము చాలా తగ్గిపోతున్నది. గుమాస్తాలకు గాని చిన్న వుద్యోగస్థులకుగాని నెల ఒకటింటికి 40 రూపాయలతో [illegible]. ఇటువంటి పరిస్థితులలో యీ మంత్రులకు 500 రూపాయలనుండి 1000 రూపాయలు చేయడం తగదని చెప్పుతున్నాను. అంతేకాకుండా వీరందరూ కూడ కాంగ్రెసు ప్రముఖులుగా వున్నారు. కరాచి కాంగ్రెసులో గాని ఇతరత్రాగాని వారి అధికారాలకు రిమ్మిందరు శాఖోలు తీర్మానాల్లు,

చెప్పింది. అందుచేత ఎక్కువగా ప్రెసిడెంటునకు కాదు. అ తక్కువ మించ కూడ దని గీర్నాలు ... మేము కోరేది ఏమిటంటే అటువంటిది అమలు పరచాలి. ఇంతవరకు చెప్పిన చట్టంలో మీరు అమలు పరచండి అని చెప్పుతున్నాను. అంతేగాని మీరు న్యాయసూత్రాలకు కట్టుబడి మన ప్రజలకు help చేయమని చెప్పుతున్నాను. ప్రజల సొమ్ము ఎక్కువగ దుబారా చేయడానికి వీలులేదు. 20, 30 వేల రూపాయలు ఆఫీసర్లు కాదని చెప్పుతున్నారు. కనుక మంత్రులందరికి కూడ మీరు 500 రూపాయలు చెప్పి గవర్నరు జీతము విషయము తిరగ దోడటము మంచిది కాదని అంటారా చెప్పినప్పుడు కూడ దానిని విచారించాలని కోరుతున్నాను. అంతేగాని దాంట్లో నియంతృత్వము ఏమిలేదు. ఇంకా పార్లమెంటరి సెక్రటరీకి 600 రూపాయలు జీతము వున్నది. మంత్రులకు జీతము తక్కువగను Parliamentary Secretary కి జీతము ఎక్కువగ వున్నదనే parity తీసికుని వచ్చి పెట్టారని కాంగ్రెసు మంత్రులు మరొక ఉద్యమమును తీసుకునివచ్చి పెట్టారని అంటున్నారు. కాంగ్రెసువారు దానికి పెద్దలు. అందువల్ల సెక్రటరీ జీతము 300 రూపాయలు చేయుటము మంచిదని అంటున్నారు. అంతేగాని మంత్రులకు 1000 రూపాయలు చేయుటము మంచిది కాదు. దేశములోని వాస్తవిక పరిస్థితుల కనుగుణంగా యీ జీతాలు తగ్గించవలెనని మనవి చేస్తున్నాను. గుమాస్తాల జీతాలు పెంచాలి. మంత్రులకు నెలకు జీతము 500 రూపాయల నుంచి 1000 రూపాయలు ఎందుకని అంటున్నారు. అందువల్ల దీని విషయంలో జీతాలు నిరూపించుట మంచిది కాదని చెప్పుతున్నాను.

ఇంకొక విషయము యేమిటంటే, మన Heads of Departments అన్నీ యిప్పుడు మద్రాసులోనే వున్నవి. మద్రాసునుండి ప్రస్తుతము మేము కదపమని ముఖ్యమంత్రిగారు చెప్పారు. అందుకుగాను, కదపలేకపోతే, మద్రాసు మనఆంధ్రదేశానికి అందుబాటులో వుందనా? అక్కడవున్న ఆంధ్రప్రభుత్వ సిబ్బంది చాలమంది బాధపడుతున్నారు. అక్కడ సరియైన సౌకర్యాలు లేకపోబట్టి వారు అక్కడినుంచి రావలెనని అభిప్రాయపడుతున్నారు. కనుక ప్రభుత్వమువారు దీనిని గురించి పరిశీలించి, అక్కడనుండి ప్రభుత్వశాఖలను త్వరలించవలసినదని చెప్పుతున్నాను.

లంకభూములను బంజరు భూములను Collector పేదవారికి మంజూరు చేయమంటే, వారికి వ్యతిరేకంగా మంజూరుచేసినారని Board of Revenue దగ్గరకు వెళ్ళితే ఈ భూములను దుబారా చేయువీలు

కాదని చెప్పారు, తప్పని సరిగా ... రికే యివ్వవలసినదని నేను కోరుతున్నాను.

పోతే, యీ Government Policy ని గురించి నేనొక విషయము చెప్పవలసివుంది. నేను శ్రీ సం... రెడ్డి గారిని కలుసుకొన్నప్పుడు ఈ భూములను Co-operative Department గాని, Revenue Department గాని యిచ్చే విషయములో కొన్ని Controvercies వస్తున్నాయని చెప్పారు. Field Labour Co-operation Society ను Register చేసుకొంటే భూమి యిస్తామని Collector గారు అంటారు. Collector గారు భూమి యిస్తామని చెప్పారు. F. L. C Society ని Register చేయవలసినదని Co-operative Registrar గారి దగ్గరకుపోతే, భూమి మీ పేర యిచ్చుతుంటే, నేను Society ని Register చేస్తానంటారు. అందుచేత ఆ (ధరాష్ట్ర) ప్రభుత్వముయొక్క Policy తెలియకుండా వుంది. ఈ రకంగా యిప్పుడు ప్రభుత్వము నడుస్తూవుంది. ఇది యెట్లావుందంటే. ఎద్దుముందా పెద్దిముందా అన్నట్లుగావుంది. అనేకమంది వ్యవసాయకూలీలు Registrar దగ్గరకువెళ్ళితే, భూములనుఇవ్వమని అడుగుతే, వారు నిరాకరించారు. అందుకుగాను యీ Anomoly తొలగించవలసిన అవసరమువున్నది. కాబట్టి ఇది తప్పనిసరిగా Revenue Department కే తెచ్చిపెడుతున్నాను. ఈ విషయంలో ప్రభుత్వము ఆలోచించాలి. మంత్రిగారి దగ్గరకువెళ్ళి సమావేశమైనపుడు, మేము చెప్పినసూచనలను మీరు తప్పకుండా తీసుకొనవలసిన అవసరముందని చెప్పాము.

హరిజన అభ్యుదయ శాఖచూస్తే. (Harijan Welfare Department), యీ Harijan welfare work చేయువలసినది యెవ్వరు? ఈ శాఖలో Director of Harijan Welfare ఒకరు వున్నారు. ఈ Directer of Harijan Welfaro యీ శాఖలో జరిగే పనులను గూర్చి సూచిస్తూ వుంటారు. కాని, యీ పనులన్నియు Collector గారు చేయించవలసివుంది. అక్కడ పనిచేసే Special Tahsildar Collectorకు లోబడివుండి పనిచేస్తున్నారు. ఈCollector Board of Revnue క్రింద పనిచేస్తున్నారు. ఈ Director గారు చెప్పినవి యెవ్వరు ఖాతరు చేయడంలేదు. అందుచేత Director గారి ఆఫీసుకు, Collector గారి ఆఫీసుకు మధ్య works విషయంలో Co-ordination లేదని తెలుస్తోంది. మద్రాసులోవున్న Harijan Welfare Department యిక్కడకు త్వరలో తప్పనిసరిగా

మార్చవలెను. దీనికి అధికారి యెవ్వరో తెలియకుండా వుంది. ఇది యే Departmentకు లోబడివుంది. Revenue Department Harijan Welfare Department క్రింద ఖర్చుఅయ్యే డబ్బు అధికారుల చేతులలోనో, మరి యే యితర కొద్దిమంది చేతులలోనో పోతోంది.

Director Sanction చేసే Grants అన్ని Collector వాటిని సకాలంలో works విషయంలో ఖర్చు పెట్టకపోవడంవల్ల, అవి lapse అవుతున్నాయి. అందువల్ల పనులన్నియు stand stillగా వున్నవి. కావున, ప్రభుత్వము దీని నంతయు సమగ్రముగా పరిశీలించి, ఆ Departmentలో జరిగే అవకతవకలు మున్ముందు కలుగకుండా, తగినచర్యలు తీసుకోవలసివుంది. ఈ విషయాలన్ని యిది వరకే ప్రభుత్వ దృష్టికి తీసుకువచ్చాము. కృష్ణాజిల్లాలో అనేక Harijan Welfare Contres వున్నాయి ఇప్పటికిన్ని అక్కడపనియేమాత్రమూ చురుకుగా సాగడంలేదు. ఇప్పుడు కొన్నికొన్ని కొత్తపనులు చేయబోతున్నామని చెప్పుతున్నారు. కాని వాటియొక్క benefits హరిజనులు పొందడంలేదుకాబట్టి, ముందు దానివిషయమైఅందరి అభిప్రాయములను ఆలోచించి, పరిశీలించి, ఆచరణయోగ్యమైన చర్యలు తీసుకోనవలసినదని నేనుప్రభుత్వమువారిని కోరుతున్నాను.

SRI P. PUNDARIKAKSHACHARYULU :— అధ్యక్షా! నాకు ఈ Heads of Officers Demand పై మాట్లాడేటందుకు అవకాశమిచ్చినందులకు నేను చాలాసంతోషించుచున్నాను.

రాష్ట్రపరిపాలన సక్రమముగా నడుపవలెనంటే రాష్ట్రంలోని ఉద్యోగస్థులనందరను సంతృప్తికరముగా జీవించునటులచూడడం ప్రభుత్వం చూడవలసినవిషయం చాలా ముఖ్యమైనవిషయము. రాష్ట్రం అంతటికి గవర్నరు ఎంతముఖ్యమో జిల్లాకు కలక్టరు ఎంతముఖ్యమో గ్రామానికి గ్రామోద్యోగులు అంతముఖ్యులని తెలుసుకోవలయును. గాని వారిపరిస్థితులు చాలా హీనముగాయున్నవి. నాకు ముందుగా మాటలాడిన మిత్రుడుచెప్పినట్లుగా వారు లంచగొండులుకొంతవరకు. రైతులను కూలీలను పీడించుకుతింటూరన్నది నిజమే. దానికి కారణము మన గ్రామోద్యోగులకు తగిన జీతభత్యాలులేకపోవడమే. నెలకు20/- జీతంతో గ్రామోద్యోగి ప్రతిరోజువచ్చే ప్రతిడిపార్టుమెంటుఉద్యోగస్థులు హెల్తు. రెవిన్యూ, అగ్రికల్చరు, పోలీసు మొదలగువారికి సప్లైలుచేస్తూ

ఏమిఅగుచున్నవో తెలియదు. ఈ డిపార్టుమెంటుల హెడ్సు నామమాత్రం కాకుండా విచారణచేసి అమలుపరచేటట్లు ప్రభుత్వంచూడవలెను.

Co-ordination of different departments సమస్య అధ్వాన్నంగాఉన్నది. మాజిల్లా నందివాడ నాగావళీనదికి ప్రాజెక్టు స్కీము ఇన్వెస్టిగేషను జరుగుతున్నది. P. W. D. వారు సర్వేకావలెనుఅన్నారు. ఆప్రాంతం ఎస్టేటుకాబట్టి సర్వేకాలేదు. సర్వే ఇప్పుడు కాదు due course లో అవుతుందిఅన్నారు. ఈవిధముగా Co-ordination లేకపోతే అభివృద్ధికార్యక్రమాలు కుంటుపడతాయికాబట్టి ప్రభుత్వంవారు వెంటనే వివిధప్రభుత్వశాఖల co-ordination లోపము చేయాలని చర్యతీసుకోవాలని మనవిచేస్తున్నాను.

ఈ దేశములో చిన్నఆఫీసర్లు పెద్దఆఫీసర్లు కావడంకష్టం. ఎందుచేతనంటే direct recruitment జాస్తిగా చేస్తున్నారు. అంతేకాదు. జీతంలోవ్యత్యాసంవుండుటకు కొంతకారణమే. పెద్దఆఫీసర్ల జీతాలకు చిన్నఆఫీసర్ల జీతాలకు చాలా వ్యత్యాసము వుండనవసరంలేదు. అది తగ్గించవలెను.

నాగభూషణంగారు ప్రభుత్వంవారి Food policyని కంగ్రాచ్యులేటుచేసేరు నేనుకూడాచేస్తున్నాను. ఒక విషయంమాత్రంచెప్పాలి. మద్రాసుప్రభుత్వం జోనలుసిస్టములో తూర్పుగోదావరి శ్రీకాకుళం వైజాగుజిల్లాలు ఒకజోనుఅయినా గోదావరినుండి మాకు ధాన్యంరావడానికిబదులు శ్రీకాకుళంనుండి ఎగుమతి అగుతుండేవి రాజమండ్రికి. మద్రాసుకుకూడా ఈనాటివరకు పోతున్నాయి. దీనివల్ల ధరలు పెరిగే అవకాశంవుంది కాబట్టి ప్రభుత్వంవారు ఈరవాణాఅరికట్టేదానికిచర్యలు తీసుకోవలసిందని చెబుతూ నేను విరమించుచున్నాను.

ఇంకోవిషయం. భూములు ఎవరికిఇవ్వడంఅన్నది Landless-poor కు ఇవ్వాలనిఅన్నాము. వందలఎకరాలు ఉన్నవారుకూడా కొంత భూమి తీసుకొంటున్నారు. వ్యవసాయకూలీలకు, సాగుకుతీసుకొనేవారికి అనేకతగాదాలుఉన్నాయి. దీనిపై ప్రభుత్వానికి స్పష్టమైన విధానము లేదు, భూములు దున్నుకున్నవారినుండి లాగుకొని రాజకీయకారణాలతో భూములుఇవ్వడం చాలాఅన్యాయం. కాంగ్రెసువారికి బలమున్నది కదాఅని పేదవారిభూములు తీసుకోవడం న్యాయంకాదు. ప్రభుత్వం ఈ విషయాలన్నీ దృష్టిలోపెట్టుకొని ఒకనిర్ణయానికిరావాలని ప్రార్థించుచున్నాను.

వ్యవహారము వల్ల చాల కాలం వ్యర్థమవుతుంది. ఈ విధముగానే ఒక చిన్న విషయం మా ప్రాంతంలో సంభవించినది. అదేమిటంటే మా ప్రాంతంలో ఒక చెరువున్నది. దానిలో నీరు అయిపోయింది. దాని కట్టలు చాల పాడైపోయినవి వాటిని బాగుచేయడానికి P. W. D. శాఖవారిని కోరినాము దానిలో నీరు లేకపోవడం మూలాన 400 ఎకరములకు నీరులేకుండా పోయింది అప్పుడు మేము వారిని pumping scheme పెట్టవలెనని ప్రభుత్వాన్ని కోరినాము. అప్పుడు ప్రభుత్వం వారు harvest అయినతరువాత దానిని పరిశీలించడం మొదలు పెట్టారు ఆ pumping scheme విషయంలో Revenue శాఖ వారు, P. W. D. శాఖవారు, Agricultural శాఖవారు ఆలోచించాలి అని అన్నారు. తరువాత department కి సంబంధించిన అధికారులు వచ్చారు. కాని సకాలంలో పనిమాత్రం జరపలేదు నేను అప్పుడు (శ్రీ) రాజగోపాలాచారి గారితో మనవిచేశాను. అప్పుడు వారు ఆయా departments వారికి ఆ పనిని చేయటానికి ఇంతవరకు నిలుపలేదు ఒక డిపార్టుమెంటు అధికారివస్తే ఇంకొక డిపార్టుమెంట్ అధికారిరాకు అందువల్ల ఈవిషయమై వారు సకాలంలో కలుసుకోలేక పోయారు. పుణ్యకాలం కాస్తా గడిచిపోయింది ఇప్పుడు ఒకజిల్లాలో ఇలాంటి పనులు సరిగా జరుగడంలేదంటే దానికి కారణం ఏమిటంటే ఒక department కి ఇంకొక department కి co-ordination గాని co-operation గాని లేకపోవడమే కారణం. జిల్లాల్లో Departments మధ్య co-operation లేకపోతే చాలకష్టం ఇప్పటివరకు ఆ చెరువు మరమ్మతులు చేయబడలేదు దానిని గురించి P. W. D. వారు investigation చేయడమైనది. కాని ఆవిషయమై Agricultural Department అధికారులు పరిశీలించడం P. W. D. శాఖ ఇంజనీర్లను కలుసుకోవడం ఇంతవరకు జరగలేదు. అందువల్ల అక్కడచాలా నష్టం కల్గుచున్నది. P. W. D. శాఖలో 2, 3 జిల్లాలకు కలిపి ఒక Superintending Engineer ఉంటున్నాడు ఒక్కొక్కజిల్లా Executive Engineers, Assistant Engineers చూసుకుంటున్నారు అసలు ఏచిన్న పనికైన ఉత్తర్వులు Superintendent Engineer దగ్గర నుంచి రావాలి జిల్లాలలో ఉన్న Assistant Engineers చాలా తక్కువ ఉండడంవల్ల అక్కడ Minor Irrigation పనులు జరుగుటకు చాలా కాలంపడుతున్నది. అందుచేత, ప్రభుత్వంవారు Minor Irrigation పనులనుకూడా P. W. D. శాఖకు వదలిపెట్టినట్లైతే బాగుంటుందను కొంటాను. ఈ Minor Irrigation పనులు Revenue Board

శాఖక్రిందఉండి P. W. D. శాఖకు సంబంధించిన్న ఉండటం వల్ల పనులు సరిగా జరగటం లేదు. అందుచేత Minor Irrigation Schemes ను ప్రత్యేకంగా P. W. D. శాఖకు ఇచ్చి వాటికి ప్రతి జిల్లాకు ప్రత్యేకంగా వొక Engineer ను నియమించినట్లైతే Minor Irrigation పనులు త్వరత్వరగా జరుగుతవి. జిల్లా కేంద్రములలోను జిల్లాలలోను, వొక Departmentకి ఇంకొక Departmentకి co-ordination లేనందువల్ల ప్రజలు చాలా ఇబ్బందులకు లోనవుతున్నారు, చాలా కాలం lapse అవుతున్నది. అందుచేత ఈ lapse కాకుండా departments లో co-ordination ఏర్పాటు చేసుకో దానికి ప్రభుత్వంవారు ఉత్తర్వులు జారీచేయాలని ప్రభుత్వమునకు మనవిచేస్తున్నాను. జిల్లాలలో Departments మధ్య co-operation, Co-ordination ఉన్నట్లయితే అన్ని పనులు సులభంగా Lapse లేకుండా జరుగుతాయి. ఇంకా గ్రామాలలోని చెరువుల మరమ్మతుకు ఇంకా Minor Irrigation పనులు అన్ని నిర్వహించడానికి ప్రతి జిల్లాలోను ప్రత్యేకంగా వొక official ను వేసినట్లైతే పనులు బాగా జరగటానికి అవకాశం వుండును. Minor Irrigation Schemesకు సంబంధించిన పనులు అనగా కట్టలు పడిపోయిన వాటికి కట్టలు వేయించడం మొదలైన పనులు చేయించడానికి జిల్లా President లేక వేరే non-official Committeeగాని, ప్రజాప్రతినిధులుగాని ఎవరి super-vision క్రిందనైనా P. W. D. శాఖవారిచే జరపబడుటంవల్ల lapse లేకుండా పనులు జరుగుతాయి. ఈచిన్నచిన్న Minor Irrigation పనులుకూడా P. W. D. Irrigation శాఖవారి ద్వారా చేయుటకు ఏర్పాట్లు చేసిన అవి సక్రమంగా జరుగుటకు అవకాశం కల్గుతుంది. ఈ Minor Irrigaton పనులపై డబ్బుఖర్చు పెట్టుటకు వాటిని సక్రమంగా చేయుటకు జిల్లాకు వొక కమిటీని ఏర్పాటుస్తూ జిల్లాలో వొక Depart-ment కు ఇంకొక Departmentకు co-ordinition ఏర్పాటుచేస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేయగలరని ఆశిస్తూ ఈ బడ్జెట్ డిమాండ్ ను బలపరుస్తూ విరమిస్తున్నాను.

*Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా! ముఖ్యంగా వివిధ శాఖలు సమర్థనీయంగా పనిచేయడానికి, ప్రభుత్వము ప్రత్యేకమైనటువంటి పరిశీలన చేయవలసిన అవసరమున్నది అని మాత్రము నేను మనవిచేస్తున్నాను. ఒకవిషయానికి సంబంధించిన వ్యవహారాన్ని రాష్ట్రములో ఉన్నటువంటి ఉన్నతమైన ఇనుపురు అధికారులు పరిశీలన చేయవలసిన సందర్భంలో ఆ సమస్య అంతత్వరగా పరిష్కారం కాకపోవటము

శాక చివరకు అది వికృతరూపమును దాల్చడం సంభవిస్తుంది. దీనికి ఒకడుదాహరణ మిస్తున్నాను. చేనేతపరిశ్రమకు సంబంధించినవ్యవహారాలను Director of Controlled Commodities అని ఒకరు, Director of Industries అనిమరొకరు, Registrar of Co-operative Societies అనిమరొకరుపరిశీలిస్తున్నారు. ఈవ్యవహారాలనుఆలోచించడంలో Director of Controlled Commoditiesకున్నూ Registrar కున్నూ అనేకసందర్భాలలో అనేకవిషయాలలో అభిప్రాయభేదాలు వస్తూవుంటాయి. పూర్వపుమద్రాసురాష్ట్రంలోHandloom Committee అనేదిఉంటూవుండేది. ఈ Handloom Committee కి డైరెక్టరుఆఫ్ కంట్రోల్డుకమోడిటీసుగాఉన్న ఒక I. C. S. ఆఫీసరు అధ్యక్షులుగా వుండేవారు. ఆ కమిటీలో, చేనేత సహకారసంఘాలకు, చేనేత పరిశ్రమకు కావలసిన ఆర్థికసహాయం కల్పించేనిమిత్తం ఒక Cottage Industries, Finance Corporation నెలకొల్పాలనే ఏకతీర్మానం నెగ్గింది. ఈవిషయంలో రిజిస్ట్రారుగారు అభ్యంతరం చెప్పడం, దానికి చివరకు Descent note వేయడంజరిగింది. కాని సమావేశములోమాత్రము అధికసంఖ్యాకులు ఆతీర్మానాన్ని అంగీకరించారు. ఇది Development Department కు వెళ్ళింది. అయితే, ఆ Development Department లో ఆ రిజిస్ట్రారుకు ఉన్నటువంటి పలుకుబడినంతా వినియోగించుకొని ఆ సమస్యను పునరాలోచనకు వచ్చేటట్లుచేశారు. ఆ తీర్మానానికి విరుద్ధంగా చేయగలిగినదంతా రిజిస్ట్రారుగారు చేశారు. చివరకు ఆ ప్రతిపాదన ప్రభుత్వస్థాయిలో విరమించబడింది. ఇప్పుడు ఈ ఆంధ్రప్రభుత్వంలో రిజిస్ట్రారుగాను, Director of Controlled Commodities గాను ఈ రెండుఅధికారాలకున్నూ ఒకే అధికారి ఉన్నాడు. Director of Industries గా ఆయన ఉండకూడదని చెప్పుచున్నారు. ఈ చేనేతపరిశ్రమ మన దేశములో చాలా ప్రధానమైనపరిశ్రమ. మన రాష్ట్రంలో 20లక్షలజీవనానికిసంబంధించినటువంటిది. 6వందల చేనేతసహకారసంఘాలున్నాయి. ఈ వేళ ఇండియాప్రభుత్వము అనుసరిస్తున్నటువంటి విధానంప్రకారం యావత్తు చేనేతపారిశ్రామికు లందరు సహకారసంఘాలలో చేరాలనేది ప్రధానమైనఆలోచన అయినప్పుడు సహకారసంఘాలన్నిటికి రిజిస్ట్రారుగాఉన్న ఒకేఅధికారి చేనేత సహకారసంఘాల పనిపాట్లను సంతృప్తికరముగా పరిశీలించటానికి అవకాశంపూర్తిగాఉండదు. ఇప్పుడు అనేక రకాలైన సహకార సంఘాలున్నాయి. Land Mortgage Banks ఉన్నాయి. Credit Societies ఉన్నాయి. Stores ఉన్నాయి. Field Labour

ఇస్తే, వారి వంశపరంపరము బ్రతకడానికిని, వారికి వృత్తి ఏర్పడడానికిని అవకాశమున్నది ఈనాడు ప్రతిజిల్లాకును, ఒక డిప్యూటీ కలెక్టరును వేసినట్లైతే 11 జిల్లాలలో ఉన్నటువంటి యావత్తుబంజర్లకు సంబంధించిన భోగట్టాఅంతా విచారణచేయడానికి చాలాసులభము. అట్లుగాకుండా జిల్లాకుసంబంధించిన వ్యవహారాలన్నిటిని చూడవలసినటువంటి జిల్లాకలెక్టరుకో, లేక తాలూకాపరిపాలనఅంతా చూస్తున్నటువంటి తాశీల్దారుకుగాని, డిప్యూటీతాశీల్దారుకుగాని మీరు ఈ వ్యవహారాన్నిఇస్తే వాటివల్ల సమస్య పరిష్కారంకాదు. ఈ పద్ధతిలో నాకు విశ్వాసంలేదు. అందువల్ల ఈసమస్యను పరిశీలించి పరిష్కరించేవిషయంలో ప్రతిజిల్లాకు వొక డిప్యూటీకలెక్టరును నియమించాలనే ఈ సూచనను ప్రభుత్వము తప్పనిసరిగా ఆలోచిస్తుందని అనుకొంటున్నాను. దీనికొరకు ప్రభుత్వానికి అంతవ్యయముకూడ కాదు. ఇప్పుడు ఎంతోమంది డిప్యూటీకలెక్టర్లు తాశీల్దార్లు, ఉన్నారు. అటువంటప్పుడు మేము వొక డిప్యూటీకలక్టరును మాత్రమే అడుగుచున్నాము. అవిధంగా ప్రత్యేకంగా ఒకఆఫీసరును నియమించినట్లైతే, ఈ బంజరుసమస్య వక 6 నెలలో సంపూర్ణంగా పరిష్కారంకావడానికి అవకాశమున్నది. దేనికైనాగాని ప్రభుత్వము వొక స్పష్టమైనవిధానాన్ని అనుసరించాలి. ఉదాహరణకు, 6మాసాలక్రితము రాంపేగు అధికారులకమిటీవారు వక నివేదికనుపంపిస్తే, దానిమీద Secretariat level లో Conferenceజరిపి, తీర్మానాలు చేశారు. అవి మంత్రులముందుకువచ్చాయి. కాని ఆవిషయమై ఇంతవరకు వక నిర్ణయంచేయడం జరగలేదు. దానివలన ఆ డిప్యూటీకలెక్టరు చేతులు ముడుచుకొని కూర్చోవలసినపరిస్థితి ఏర్పడింది. పరిస్థితులు ఈ విధంగా ఉన్నాయిఅంటే మనపరిపాలనా విధానములో పనులు చురుకుగా జరగడానికివీలుగా మన కార్యనిర్వాహక శాఖను పునర్నిర్మాణము చేసికొనవలసిన అవసరంఉంది. అందువల్ల బంజర్లవిషయమై వకఆఫీసరును ప్రత్యేకముగా నియమించినట్లైతే వక మూడు, లేక ఆరుమాసముల లోనే ఈసమస్య పరిష్కారంకాగలదు.

వెంకయ్యగారు ఇంతకుపూర్వము చాలా బాధపడుతూ ఉపన్యాసంచేశారు. వారు చెప్పడంలో, ఎవరైతే వారిజండాలుపట్టుకొని తిరుగుతారో, వారేపేదవారని, మిగతావారు పేదలుకాదని భావిస్తున్నట్లున్నది. ఆవిధంగా వారి జండాలుపట్టుకొనితిరుగుతూ భూమినిఆక్రమించినవారుమాత్రమే పేదలుకాబోలు. పాపము ఆయన ఇదంతా కల్లడి చేసుకొన్నారు, నిజంగా ఎవరు ఏవిధంగా, దౌర్జన్యంతో భూములను

ఆక్రమించుకొన్నారనేది కొంతఆలోచనచేసి విచారణజరిపితే స్పష్ట పడుతుంది.

రజకులు ఒక సహకారసంఘం పెట్టుకుని, ఆ సహకారసంఘంవారు 98 ఎకరాలపొలం సేద్యంచేసుకుంటూ ఉంటే అ పొలంలోనుంచి పైరు కోసుకుపోవడం నేరం కాదా? ఒక పార్టీలోనుంచి ఉన్నందుకు మాత్రంచేత అందులో ముఖ్యంగా కమ్యూనిస్టు పార్టీలోనుంచి ఉన్నందుకు మాత్రంచేత, ఇతర పార్టీలలో యున్నవారు ఒక సహకారసంఘం పెట్టుకుని సేద్యంచేసుకుంటూయున్న 98 ఎకరాల పొలములోయున్న సస్యంకోసుకువెళ్ళడం అక్రమం, అన్యాయం కాదా? అట్లాంటి అరాచకం తల ఎత్తకండా చూచే బాధ్యత ప్రభుత్వంమీద ఉన్నది. పేటపాలెం దగ్గరలోయున్న నరసాయపాలెం ప్రజలను వాకబుచేస్తే నిజానిజాలు తెలుస్తాయి. ఈ విషయాలలో ప్రభుత్వం ఒక సుస్పష్టమైన విధానం అనుసరించకపోతే ఇటువంటి అరాజకాలు హెచ్చిపోవుటకు వీలుంది. ప్రజలు ప్రభుత్వంలో విశ్వాసం కోలుపోయే అవకాశాలున్నాయి. ఇది ప్రభుత్వం గుర్తించమని హెచ్చరిస్తున్నాను.

Sri K. VENKAYYA:— On a point of personal explanation. నిన్న నేను మాట్లాడిన సందర్భంలో ఉద్రేకంతో బాధపడి అక్కడి పరిస్థితులకు భిన్నంగా మాట్లాడానని సెలవిచ్చారు. ఇప్పుడు బహిరంగ విచారణకు సిద్ధంగాయున్నానని ఆయన చెప్పారు. ఆవిచారణ నిజంగా ఎవరి అధీనంలోయున్న భూమికాజేశారో ఆ విచారణకు సిద్ధమయ్యేటట్లయితే ఇబ్బందిలేదు. పైరు కోసుకువెళ్ళారన్నారు. ఎవరు కోసుకువెళ్ళారంటే పేదలవైన్ను తిప్పి ఎవరోచేశారని నిందారోపణచేసి అక్కడనుంచి blackmail చేశారని చెప్పాను. ఎవరిమీద చర్యతీసుకోవాలనే విషయం కోటయ్యగారు గమనించాలని కోరుతున్నాను.

*Sri V. CHIDANANDAM:—ఉపాధ్యక్షా! ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంలో, ఉద్యోగులబాధలు మనంగమనించడంలేదు. కొంతమంది కన్నడిగులు ఎక్కువ జీతం వస్తుందని ఆంధ్రులమనే పేరుతో బళ్ళారి జిల్లానుంచి, రాయదుర్గ, ఆలూరు, ఆదోని తాలూకాలలో వుద్యోగులుగా నిలచిపోయినారు. మైసూరు రాష్ట్రం Non-Gazetted ఆఫీసర్లను తీసుకొనుటకు నిరాకరించిందని తెలుస్తోంది. బళ్ళారిజిల్లా మన రాష్ట్రంలోనుంచి విడిపోయినప్పుడు ఆ జిల్లా ఆఫీసర్లు కూడా అక్కడకు పోవుటసహజం, కాని ఆంధ్రులు మాత్రమే అక్కడ

నుంచి త్రోసివేయబడితే అదికూడా ఇచ్చిందిలేదు. ఇంజనీరింగు శాఖలో నేమి Education Department లో ఏమి, Revenue Department లో నేమి కన్నడిగులు ఎక్కువగా యుండి, అందులో Gazetted rankలో యున్నవారు. మైసూరు stateకు పోతామన్నా, మనకు త్రోసివేయబడ్డారు. ఇప్పుడు ఈ ఆలూరు, ఆదోని వగైరా తాలూకాలలో ఉద్యోగులుగాయున్న కన్నడిగులు ఇంకా ఆప్రాంతం అంతా, కన్నడ ప్రాంతానికి పోవాలనేదానికి మద్దతు ఇస్తున్నారు అటువంటి వారిది ఒక list తయారుచేసి, వారు ఆంధ్రులా కన్నడిగులా అని తెలుసుకొని, కన్నడిగులైతే వారి రాష్ట్రానికి పంపివేయడం, లేదా వారు కన్నడ ప్రాంతానికి ప్రచారంచేయకుండా ఇతరజిల్లాలకు మార్చడం సబబుగా ఉంటుందని మనవిచేస్తున్నాను. తరువాత officerలకు transferred, allotted అనే పద్ధతిపెట్టినారు. మన ఆంధ్రులలో ఆ యూఉద్యోగాలకు తగినంతగా qualifications ఉన్నటువంటి శాస్త్రజ్ఞులు, ప్రవీణులు ఇక్కడ ఉన్నారని విచారించకుండా ఇంజనీర్లను ఇంకా Executive ఇంజనీర్లనూ ఇక్కడ నిలుపుకున్నారు. మన రాష్ట్రంలో ఇంతమంది Economics Honours డిగ్రీలు పాసయిన వారుండగా Lecturer లుగానూ, Professor లుగానూ అరవలు నిలచిపోయినారు. అరవలు మానవులుకారదన్నీ, వారువెళ్ళిపోవాలనీ నేను చెప్పడంలేదు. కాని ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరువాత మన రాష్ట్రంలో అట్టి ఉద్యోగాలు ఇవ్వాలనీ, ఆంధ్రులు లేకపోయినప్పుడే వారిని తీసుకోవలసినదనీ చెబుతున్నాను. అసిస్టెంటు lecturerలను Lecturer లుగా, lecturerలను ప్రొఫెసర్లుగా, Promote చేసినతరువాత, మన రాష్ట్రంలో చదువుకున్న వారు లేకపోతే అరవవారిని తెచ్చి వుండవలసినదేకాని, మనవారుండగానే, అన్ని చోట్లా అరవవారే వుద్యోగులుగా ఉండుట ఏమిబాగుంటుందని మనవిచేస్తున్నాను. తరువాత మామూలు పరిపాలనా విధానంలో లంచగొండితనం అపారంగా ఉంది. అది సర్వేసర్వత్రా ప్రతి departmentలో వ్యాపించియున్నది. Co-operative departmentలో చెప్పనవసరంలేదు. నాగభూషణంగారు self-realization వచ్చేవరకూ కాలవ్యవధి కావాలన్నారు. అది ఎంతవరకూ అని నాప్రశ్న ? ఒక వ్రణంపెరిగినప్పుడు ఆపరేషన్ చేసి దాన్ని తీసివెయ్యకపోతే, తొడవరకూ ఆవిషం వ్యాపించి కాలే కోసివేయవలసియుంటుంది. (నవ్వు) లేకపోతే తలవఱకు ప్రాకి ప్రాణమేపోతుంది అందువల్ల లంచగొండితనం మాన్పుటకు ప్రభుత్వం తగినచర్య తీసుకో

ఇవిఅన్నీ తెలుసును. మంత్రిగావుండి ఇంతవరకు ఏమిచేయకపోవడంచాలా విచారకరం ఇటువంటిలోపాలు ప్రతిచోటఉన్నాయి. కనుక లంచ గొండితనాన్ని రూపుమాపడానికి ప్రయత్నించాలి, త్వరగా రిప్లైఇవ్వాలంటే అబద్ధపుసమాచారం ఇస్తున్నారు. నిన్నను మాకలక్టరుగారు మాజిల్లాలో ఎర్రగడ్డలులేవు; Deficit district అని వ్రాసినారట. మాజిల్లానుంచి ఎర్రగడ్డలు ఎగుమతికాకుండావుండడానికి ఇతరజిల్లాల నుంచి డబ్బు సంపాదించుకొనకుండా చేసిన ఈ ఆర్డరును ఆహారమంత్రి అయినకోటిరెడ్డిగారుసరిచేసి, న్యాయంచేస్తారనిఆశిస్తున్నాను. అతిఆలస్యం గాను, అతిశీఘ్రంగాను జవాబులుపంపకుండా వారికి తగిన వ్యవధి మాత్రమేయిచ్చి ప్రభుత్వమువారు తమక్రిందివుద్యోగులకు ఉత్తర్వులు పంపాలి. గ్రామోద్యోగులకు ఋజానానువెంట జవాబుపంపవలసినదని వ్రాసినా తహసీల్దార్లు ప్రశ్నలు ఇస్తూవుంటారు. వారున్నావారికి తోచిన అంకెలువారే వేసి ఇస్తూవున్నారు. అందుకనే కరణాలలెక్కలు కాకులలెక్కలుఅని వకసామెతవున్నది గ్రామోద్యోగులు మామూళ్లు తీసుకుంటారని శ్రీసిద్ధన్నగౌడఅన్నారు. వారికదిసహజం. స్వల్పజీతగాండ్లు యీ తక్షాలపుఉద్యోగులుకాని గ్రామోద్యోగులు అదనంగాచేసినపనికి మామూళ్లుక్రిందతీసికొనడం తప్పుకాదు. ఇతరప్రభుత్వోద్యోగులు తీసుకునేలంచాలను ఆపలేక బీదలపైనపడడం న్యాయంకాదు.

Sri K VEERANNA PADAL:—ఉపాధ్యక్షా! ఈ రాష్ట్ర పరిపాలనను గురించి ప్రసంగానికి నేను విన్నవిస్తున్నాను. మన ఆంధ్ర రాష్ట్రానికి చెందిన విశాఖ పట్టణం ఏజన్సీ సముద్ర తీరానికి 3000 అడుగులు ఎత్తునగల 1800 square miles వున్న area. ఆ ప్రజలను పరిపాలించే జిల్లా కలెక్టర్‌కు అక్కడ ప్రజలను గురించి వారి కష్టసుఖాలను గురించి తెలియదు. అక్కడ ప్రజల అభివృద్ధి కోసం ఆప్రాంత అభివృద్ధికోసం కేంద్ర ప్రభుత్వం లక్షలాది grant ఇస్తున్నారు. ఆ ప్రాంతాన్ని ప్రజలను అభివృద్ధి చేయాలనే ఉద్దేశం అక్కడ కలెక్టరుకు గాని అక్కడ వుండే Engineering department కు గాని లేదు. ఏజన్సీ ప్రాంతానికి ప్రత్యేకంగా ఒక కలెక్టరుగాని డిప్యూటీ కలెక్టరును గాని ఏర్పాటు చేస్తే అక్కడ పరిపాలనా విధానం గురించి, రాకపోకల సౌకర్యాల గురించి, ఆసుపత్రుల గురించి, మలేరియా, న్యుమోనియా మొదలైన జ్వరాలను తగ్గించి D.D.T. నాడకంగురించి ప్రత్యేక శ్రద్ధ వహించి పనిచేయడానికి అవకాశం వుంటుందని మనవిచేస్తున్నాను. ఏజన్సీ ప్రాంతంలో నూటికి నూరుమంది, ఓ, న, మా లు రాని ప్రజలు వున్నారు. అడివి ప్రాంతాలుగా కొండల్లో వల్లసిన ప్రజలుకూడా వున్నారు, మంత్రులుగాని శాసన

సభ్యులుగాని వస్తే ఆ మనుష్యులను చూపిస్తాను. ప్రపంచ జ్ఞానము లేని మనుష్యులు వారని మనవి చేస్తున్నాను. అక్కడ కొన్ని స్కూళ్ళు ఏర్పాటుచేసి వున్నారు నామకః హా స్కూళ్ళు అయినప్పటికి విద్యా విధానం ఏమి లేదు. Teachers వసతి గృహం గాని, సక్రమైన జీతం గాని లేకుండా వుంటున్నారు. ఏజన్సీ ప్రాంతాల్లో వున్న ప్రభుత్వోద్యోగులు కూడా చాలా కష్టంలో పనిచేస్తున్నారు. ఒకసారి మలేరియా తగిలితే నాశనం చేస్తుంది. ఏజన్సీలో పరిపాలన చేసే ఉద్యోగులకు కేంద్ర ప్రభుత్వంలో మాదిరిగా ఏజన్సీ ఉద్యోగులకు ఇచ్చి ఇండియా ప్రభుత్వం ఏజన్సీ అభివృద్ధికి ఇచ్చే డబ్బు సక్రమ మార్గాన ఉపయోగ పడేట్లు కృషి చేస్తారని ఆశిస్తున్నాను. 916,1917, 1918 సంవత్సరాలలో బాస్టిన్ గారు ఏజన్సీ స్కూళ్ళు ఏర్పాటు చేశారు. ఆ రోడ్లు చాలావరకు ఉపయోగపడ్డాయి. తరువాత అల్లూరి సీతా రామరాజు పితూరి వచ్చినాక బ్రిటిషు ప్రభుత్వం మూడు సంవత్స రాలు హాడలిపోయింది. మనకు స్వాతంత్ర్యం వచ్చి 7 సంవత్సరాల్లో ఏ మాత్రం కూడా ఏజన్సీ పరిపాలనా విధానము గాని అభివృద్ధి గాని జరుగలేదని మనవి చేస్తున్నాను ఏజన్సీ ప్రాంతాలకు రాక పోకల సౌకర్యాలులేవు. P. W. D. సక్రమంగా పని చేయుటలేదు. Highways Department చేసినారు. ఉదాహరణకు మద్రాసు ప్రభుత్వంవారు 5 సంవత్సరాల క్రిందట 5 లక్షల రూపాయలు sanction చేసి పెదవలస కొత్తగెడ్డలకు నిర్మాణానికి పూను కున్నారు. దీనిదూరం 7 మైళ్ళు. ఆవిషయం ఇంకా investigation క్రిందనే వున్నది తప్ప ఏమిజరుగలేదు. నకకానీ ఖర్చుచేయలేదు. ఏజన్సీ రోడ్ల అభివృద్ధి కావాలంటే Special P. W. D. ఏర్పాటుచేసి ప్రత్యేక కలక్టరును వేస్తే ఇండియాప్రభుత్వం వారిచ్చే Grant ఉప యోగించుకొని అభివృద్ధిసాధించ వచ్చునని మనవి చేయుచున్నాను. ఏజన్సీలో చదువురాని అమాయకపు ప్రజలున్నారు. స్కూళ్ళును అభి వృద్ధి గావించి వారికి విద్యాభివృద్ధి కల్గించ వలసిందిగా కోరుచూ విరమిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :— ఉపాధ్యక్షా ?

DEPUTY SPEAKER :— 10 నిమిషాలలో పూర్తి చెయ్యండి.

SRI. PILLALAMARRI VENKATESWARLU:— 10 నిమిషాలు చాలదండి. 20 నిమిషాలు కావాలి. చాలామంది సభ్యులు దీనిమీద మాట్లాడారు. వారిసంభాషణలు పరిశీలిస్తే పరిపాలనా విధానం

7th January 1954] (Sri Pillalamarri Venkateswarlu)

ఏవిధంగావున్నదో బోధపడుతుంది. శ్రీ సుబ్బారెడ్డిగారు కమ్యూనిష్టు పార్టీని విమర్శిస్తూ పరిపాలనలో corruption, nepotism అన్నీ వున్నాయని చెప్పుకున్నారు. చాలామంది ఇతరసభ్యులుకూడా దీనిని చెప్పుకున్నారు. గౌ. ఆర్థికశాఖామాత్యులుకూడా ఒకసంగతిచెప్పారు. పరిపాలన సక్రమైనవిధంగామార్చడానికి ఎన్నిసంవత్సరాలుపడుతుందో తెలియడంలేదని పరిపాలనాయంత్రం మారితేనేగాని పరిస్థితులుచక్కబడవు. రెవిన్యూబోర్డు ఎత్తివెయ్యాలని వెనక శ్రీవిశ్వనాథంగారు, కోటిరెడ్డిగారు, శ్రీ ప్రకాశంపంతులుగారుకూడా చెప్పారు. 1937నుంచీ ఆవిధంగా చెప్తూనేవున్నారు. కోటిరెడ్డిగారు అధికారంలోకివచ్చినా రెవిన్యూబోర్డు మాత్రంపోలేదు. దీనిని తీసివేయకపోతే red - tapism గాని లంచగొండితనంగాని పోవు.

సమస్య కేంద్రప్రభుత్వంవారు రాష్ట్రప్రభుత్వాలన్నింటికీకూడా రాజ్యాంగచట్టంలో సవరణలుచేయబోతున్నామని, మీరు ఏయే సవరణలుసూచించబోతున్నారో చెప్పమనిఅడిగారు. దీనివిషయమైప్రభుత్వంగాని, మంత్రులుగాని శాసనసభలోగాని పత్రికాముఖంగాగాని ఏమీ ప్రకటించలేదు శ్రీ విశ్వనాథంగారి బడ్జెట్ ప్రసన్యాసంలోకూడా చెప్పలేదు. అసలు మీరు సవరణలేమైనా సూచించదలచారాలేదా ? అసలు సవరణలు పంపించినా పంపించకపోయినా యీసభముందు చర్చకుపెట్టాలి. ఇక్కడవున్నసభ్యులు, మనం చట్టాలుచేసుకోవడంలోగాని పరిపాలన చేసుకోడంలో వచ్చేకష్టాలను సూచించడానికి అవకాశంకలుగజెయ్యాలి. మనరాజ్యాంగ చట్టంలో జమీందార్లు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులయొక్క ఆస్తులు నష్టపరిహారంఇవ్వకుండా ముట్టుకోడానికివీలులేదు. జమీందార్లు, భూస్వాములు, బ్రిటిష్సామ్రాజ్యవాదుల ఆస్తులు స్వాధీనంచేసుకునేటప్పుడు దమ్మిడీకూడా నష్టపరిహారంఇవ్వకుండా స్వాధీనంచేసుకోడానికి హక్కుండాలి. స్వాతంత్ర్యోద్యమ సమయంలోను ఈ విషయాన్ని పెద్దలందరూ చెప్పుకున్నా రాజ్యాంగంలోకి వచ్చాక అవన్నీ మరిచిపోయారు.

ఏజన్సీల పరిపాలన గవర్నరు అధికారంక్రింద వుంచడంవల్ల అక్కడ జరగవలసినంత అభివృద్ధిలేదు. అక్కడ తగినంత అభివృద్ధి కావాలంటే వాటినికూడా ప్రజాపరిపాలన క్రిందకు తీసుకురావాలి, కాబట్టి ఆంధ్రప్రభుత్వం రాజ్యాంగ చట్టానికి ఏయే సవరణలు చేయబోతున్నదీ ఈ సభముందు పెట్టమని కోరుతున్నాను.

రెండు మూడు రోజులనుంచి బడ్జెట్ మీద చర్చసాగిస్తున్నాము, ప్రభుత్వానికి సరియైన విధానాలు కనిపించడంలేదు. మేము సూచించిన

యొక్క జీతాలను గురించి చెప్పారు. ఇది ఏదో పట్టుదల కోసం చేసింది కాదు. ఎందువల్ల మంత్రుల యొక్క జీతాలు తగ్గించామని అనుకుంటున్నారు? ఈ రోజున మన ప్రభుత్వోద్యోగుల జీతాలు చూచి వాళ్ళు ఏ స్థితిలో ఉన్నది అర్థం చేసుకోమని కోరుతున్నాను. వ్యతిరేక పక్షంవచ్చి మా జీతాలనుతగ్గిస్తే మేము ఊరుకుంటామా అని అంటున్నారు. ఒకవేళ గవర్నరుగారు బిల్లును తిరిగి పంపిస్తే అది చర్చించడానికి వీలులేదని చెప్తున్నారు. పార్లమెంటరీసెక్రటరీ 750 రూపాయలు మంత్రులకు 500 రూపాయలజీతం ఎలాగంటున్నారు. ఒకవేళ ఇది మంత్రుల యొక్క గౌరవానికి భంగంఅనితోస్తే అతనియొక్క జీతం కూడా తగ్గించడానికి ప్రయత్నిస్తాం. లేకపోతే ఈ పార్లమెంటరీ సెక్రటరీపదవిని తొలగించ ప్రయత్నించడమో జరుగుతుంది. 500 రూపాయలు వాడుకోమని చెప్పాం. సరిపోకపోతే సరిపోదనిచెప్పవచ్చు. అంతేగాని ఇది కక్షపూని చేసినపనిగాదని మేముచెప్తున్నాం. మీ జీతాలే కాదు. పెద్దపెద్ద ఉద్యోగుల జీతాలు, గవర్నరుజీతాలు తగ్గించడానికి పూనుకోండని మేము మీ అందరికీకూడా విన్నవిస్తున్నాం. ఏవిధముగా బంధుప్రీతివుందో ఇందాక T. N. వెంకటసుబ్బారెడ్డిగారు చెప్పారు. ఇది చెప్పాలంటే చాలామందివ్యక్తులకు సంబంధించినవిషయాలుకూడా ఉన్నాయి. ఒక District Medical Officer విషయంలో అతనికి సీనియారిటీఇచ్చి తీసుకున్నారు. సీనియారిటీ list లో 10 మందితరువాత ఇతను 11 వ వాడు. అటువంటప్పుడు అతను ఎలా అక్కడకువచ్చాడు? ఒకవ్యక్తికి సహాయంచేయడంవల్ల మీ పలుకుబడిగాని, లేక కాంగ్రెస్ పలుకుబడిగాని పెరుగుతుందని మీరు అనుకుంటున్నారా? తరువాత 50వ rank లో ఉన్నటువంటి Inspector of Survey and Land Records ను తీసుకొచ్చి Assistant Director of Survey and Land Records గా పెట్టారు. ఆ మాజీమంత్రిగారు ఇక్కడ లేరనుకోండి. ఎందువల్ల ఇలా తీసుకురావలసివచ్చింది? ఈ District Prohibtion Officers అంతా ఏమిచేస్తున్నారు? అనేక report లు మేము రోజురోజు వీళ్ళమీద పంపిస్తున్నాము కాని action మాత్రం తీసుకోవడంలేదు. పైగా పేదవాళ్ళకుమాత్రం జుల్మానాలువేసి జైళ్ళకు పంపిస్తున్నారు. ఇందాక ప్రగడ కోటయ్యగారు చాలా ఉద్రేకంతో మాట్లాడారు. అది ముఖ్యంగా కాంగ్రెస్ వారికి కమ్యూనిస్టులమీద ఉన్న ద్వేషాన్ని కప్పిపుచ్చుకోడానికిచేసిందితప్ప మరేమీకాదు. దాన్ని ఇక్కడవున్నవారు ఎవరైనాసరే నిష్పక్షపాతంగా విచారణచేయుమని చెప్తున్నారు. కమ్యూనిస్టుల ప్రోద్బలంతో ద్రోహం చేయం కోసుకుపోతు

న్నారని చెప్పారు. ఇలాంటి ఉపన్యాసాలు మీరు వినవున్నవన్నీ మీకు నేను చెప్తున్నాను. భూముల్లో పడి పైర్లు కోసుకుపోవున్నారని చెప్తున్నారని చెప్పడంవల్ల గట్టిగా వారికి సమాధానం చెప్పవలసివస్తున్నది. అక్కడ ఉన్న ప్రజలు అందరిని విచారణచేయండి.

The Hon. Sri T. PRAKASAM :— ఈ Demand మీద చర్చ తీవ్రంగా జరిగింది. అయితే, జవాబు చెప్పడానికి యేదైనా ఒకటి పూనుకొని చేయడానికి అవకాశం లేనంత తీవ్రంగాను, వేగంగాను మాట్లాడారు. చెప్పారు. Administration లో పనిచేసే టట్లు జవాబుదారీ తీసుకుంటే, వాళ్ళు time అన్నా యిచ్చే అవకాశం వుండాలి. ఏ నిమిషానికా నిమిషం జరిగే కార్యక్రమాలు ప్రతీ Subject తీసుకొని, అదే ధోరణిలో అదే వేడితో, అదే తీవ్రతతో, మాట్లాడారు, అయితే యిదంతా యెట్లాగా జరుగదు. జరిగే పద్ధతి చెప్పారు. నాకు కూడా ఆశ వుంది. ఏ విధంగా ముఖ్యంగా చేయవలసివుందో, ఆ కార్యక్రమం యెట్లా తీసుకోవాలో కోటి రెడ్డిగారు చెప్పారు. ఆయన Revenue Department Portfolio లో వున్నవాడు కనుక, చెప్పవలసిన సంజాయిషీ చెప్పారు. ఆ సంజాయిషీతో మీరు తృప్తిపడ్డారి ఆయన చెప్పడంలో ఏదైనా నసకే వున్నది వున్నట్లుగా పలుకుతారు. వున్నది వున్నట్లు పలుకుతే మీరు ఓపికతో విన్నారు. అందుచేత మీరు చేసిన సేవ - ప్రజల తరఫున మీ మీ Points మీద వాదనే చెపుతూ మీ జవాబుదారీ పూనుకొన్న వాళ్ళము. ఇక్కడ కుమ్మని, చేయవలసినది note చేసుకొని, దాని సంగతి ఆలోచించుకొని, పనిచేయవలసి వుంటుంది. దానికికూడా వ్యవధి యివ్వడం లేదు. మీ తొందర మీ చేష్ట, మీ ధాటి మీ Design అన్ని పద్ధతులు కొంచెము మార్పు చేసుకోవలసి వుంటుంది. అవన్నీ నాకుగూడ సంతోషంగానే వున్నది. మీరు చేసేది విచారించే, నేను వ్యతిరేకంగా చేసే మార్పులు నాకు కనబడుతూనే వుంది. మీరు యే సిద్ధాంతాలను గురించి మాట్లాడారో, అవి రుజువు క్రింద మేము తీసుకుంటే, మేము చేయవలసినది యేమీ లేదు. మీరు అన్నీ చెప్పారు. మొదట్లోనే ఈ శాసనసభకు యే భాష వుండవలసినదీ, తెలుగా, యింగ్లీషా అనే ప్రశ్న ఒక స్నేహితుడు చెప్పాడు. అది ఒక Cut motion క్రింద వచ్చింది. ఇది తెలుగు శాసనసభ దీనికి Official language

తెలుగుభాషే అని నేను మొదటనుంచీ అనుకొంటున్నాను. కాని తెలుగుభాష అని చెప్పినా, Government లో అది పూర్తిగా record అయ్యేవరకు Official language తెలుగు అని చెప్పే అవకాశం లేకుండా పోయింది. మీరా ప్రశ్నలకు జవాబులు చెప్పడంలోకూడా తెలుగులోనే జరగాలని వుంది. అందువల్ల వారివారి ప్రశ్నలకు, ఆయా రిపోర్టులు రాలేదు. ఆ రిపోర్టు వచ్చాక, అన్ని సందేహాలు తీర్చుకొని, మనం కూడ్యని తెలుగు భాషే Official language అని తీర్మానము చేసుకోవచ్చు. తెలుగు భాషే Official భాషగా వుంటుంది. మీరు చెప్పే దాంట్లో వ్యతిరేకంగా మాట్లాడుటకు యేవిధంగా అవకాశంలేదు. మీరు యెంతసేపు చెప్పినా బీద వాళ్ళు బీదవాళ్ళని, వాళ్ళు బాధపడుతున్నారని అంటున్నారు. అది నిజమే. దీనిని మనమందరము వొప్పుకో వలసినదే. బీద వాళ్ళు యెట్లా బాధలు పడుతున్నారో, వాళ్ళకు యే విధమైన సేవచేస్తే వాళ్ళకు అన్నము, గుడ్డ వస్తుందో అన్ని యేర్పాట్లు చేసుకోవచ్చు. ప్రభుత్వములో వున్నవారు వాళ్ళవాళ్ళకు, మెంబర్లు వాళ్ళవాళ్ళకు ఉపకారము చేసుకొని, బ్రతకమని చెప్పినవాళ్ళము కాదు. బీదవాళ్ళకు సేవ చేసే విషయంలో నాభూటి వాడిని మొదనుంచి చేస్తున్నవాడినే. భూమి విషయంలో యెన్ని మీటింగులు అయినవి. ఎన్నో పార్టీల వాళ్ళు మాట్లాడారు. ఎన్ని అయినాకాని, దానికొక మార్గం చూడాలి, ఇంతవరకు యేదో ఒకమార్గంలో యిది చేయడానికి అవకాశం లేకుండా పోయింది. కాలమాన పరిస్థితులను బట్టి, యిప్పటి పరిస్థితులను ఇప్పుడు జరిగే కార్యక్రమాలను బట్టి యేవిధమైన settlement కాకుండా పోయింది. ఇది ముఖ్యమైన సంగతి. భూమివిషయంలో యేమీచేయలేము. కనుక, ఎదో ఒక విధంగా ప్రజల హక్కులు స్థాపించుకోవాలి. ఇప్పుడు అందరికి హక్కులు వున్నవి. మీరు చేప్పేదాంట్లో తప్పు లున్నవని యెవరూ చెప్పలేదు. ఫలానా వాడిని ఫలానావాళ్ళు కొడుతున్నారు. వుండుటకు అవకాశం లేకుండా చేస్తున్నారు. భూమిని దున్ను కొనడానికి అవకాశాలు లేకుండా చేస్తున్నారు. మీరు అక్కడకు పోయి చూచి, కనుక్కొండి నేను తక్షణం వెళ్ళి మాట్లాడడానికి వీలులేక పోయింది. రొంపేరు విషయమై (శ్రీ) ప్రగడ కోటయ్యగారు మాట్లాడారు, నేను పోయి చూచి

వచ్చాడు, అక్కడ వున్న యింజనీర్లను, కలక్టర్లను, స్పెషల్ కలక్టర్లను అందరినీ చూచి, కనుక్కొని విచారణచేసి, ముఖ్యమైన విషయాలను నోట్ చేసుకొని వచ్చాను. ఆ విషయము చూస్తే వెంటనే కూర్చుని పరిష్కారం చేసే వీలు, పద్ధతులు వున్నాయా అని వాటిని గురించి చేసే నిర్ణయము నాకు కనబడలేదు. అక్కడకు వెళ్ళేవాళ్లు యింతమంది వున్నారు. యింతమంది యీ తరగతి వాళ్లు వున్నారు అని విచారించాను. వాళ్లందరుకూడ బలవంతముగావచ్చి భూములమీద కూర్చుని occupy చేశారు. అసలు వాళ్ళు వదలి పెట్టారు అని గుర్తులు కూడ వుంది. అవి అన్ని రికార్డులలో వున్నాయి. దానికి ఎట్లా చేయాలో ఏమి చేయాలో అనే పరిస్థితులలో మీరు కూడా జవాబుదారి లేకుండా మాట్లాడుతున్నారు. కనుక మీ యిష్టము వచ్చినట్లు మాట్లాడడానికి మీరు జవాబుదారి వహిస్తే, యిప్పటికైనా పని చేయడానికి వీలువుంటుంది అని చెప్పాను. ఇప్పుడు చెప్ప దానికి టైము యివ్వాలంటే, తరుముకుంటూ పోతున్నారు. Arguments యిట్లా చెప్పితే మీరు Administration కు ఎట్లా సాయపడతారు? Administration కు మీరు సహాయము చేయలేరు. నిన్న move చేసిన డిమాండు వుంది. 9 వ డిమాండులో గవర్నరు, మంత్రులవారియొక్క staff వీళ్ళందరి సంగతి కూడా వివరంగా చెప్పుకోవచ్చు. దానిమీద 17 లక్షలు ఖర్చు అవుతుంది. ఈ డబ్బు శాంక్షను చేయమని మమ్మల్ని అడిగితే నా మట్టుకు నేను, అంతా బాధపడుతూనే మీకు చాలదు కాబట్టి నేను 15 ఏండ్ల క్రితము రివిన్యూ మినిష్టరుగా వున్నప్పుడు యీసిస్టం అంతా మారుద్దాము అనుకున్నాగాని అక్కడ scope లేదని చెప్పిన వాడిని నేను. అప్పటినుంచి యిప్పటికికూడ ఒక్క అడుగు ముందుకు పోయామని చెప్పే అవకాశములేకుండా, మనలో మనము కొట్లాడితే అకారణంగా మనపైన లేనిపోని కష్టాలు తెచ్చి పెట్టుకొన్న వాళ్ళము అయినాము. ఈ డిమాండు మీద 13 cut motions యిప్పటికి వచ్చాయి. దానిలో ఏదైనా ఒకటి ప్రత్యేకంగా తీసుకుని సాధించేది యిది అని చెప్పగలరా అని ఆలోచిస్తే పెట్టుకొనడానికి నాకు ఒకటిగూడా కనబడలేదు.

మీరు Cut motion తెస్తే డిమాండును నిరాకరించినట్లే గదా. ఏదైనా ఒక పద్ధతి ఏర్పాటు చేసుకోవాలి.

మీరందరు బంజరుభూముల విషయమై ముఖ్యంగా చెబుతున్నారు. ఎన్నో లక్షల ఎకరాల భూమి ఖాళీగావుంది, అది అందరికి పంచిపెట్టమంటే, ఆ విషయముచూస్తే, ఒకదారికి వస్తుందని నేను అనుకోవటములేదు. మీరు ఒక పద్ధతి చెబున్నారు. అవి గాబోటివాడిని మీరు చెప్పినవన్ని క్రోడీకరించుకొని, ఆలోచించి, ముఖ్యంగా చేయవలసి వుంటుంది. అటువంటి కార్యక్రమానికి పూనుకునేటంత అవకాశమిచ్చేవారేనా, మీరుకూడా! అది గారు సంతోషమే. నా ideas వేరు, నాsystem వేరు. నేను మళ్ళీవచ్చాను గనుకనే, మీరు చెప్పే దానికి నేను ఏకీభవించి పని చేద్దామనుకుంటే మీరు ప్రతి దానికి అడ్డము వస్తూంటె ఎలాగు ? నాగిరెడ్డిగారు వూరికే కేకలు వేస్తే యిది అయ్యేది కాదు. మనం ఎక్కడో తిరిగివచ్చి చివరకు ఒకచోట యిక్కడ కలుసుకుంటున్నాము. ఇప్పుడు మనం చేయాల్సింది యేమిటంటే, అన్ని విషయాలు మనం న్యాయంగా ఆలోచించ వలసియున్నది. ఆంధ్రరాష్ట్రి విభజన అయిపోయింది. మనం ఎట్లాగో యీ శాసనసభను ఒకటి పెట్టుకొని యిక్కడ సమావేశమయ్యాము. తప్పో ఒప్పో రాజధాని ఈ కర్నూలులో పెట్టుకున్నాము. ఈనాడు శాసన సభ్యులుగా మనం యిక్కడ సమావేశమై యిప్పటినుంచి ప్రజలతరఫున మనం స్థిమితంగా కూర్చుని ఆలోచించి చేసుకోవలసిన పనులు చాలా వున్నవి. అవన్నీ చేయడానికి యిక్కడ సిద్ధంగావున్నాము. ఏవిధంగా యిక్కడ పనిచేస్తె అన్ని పనులు కూడా కలిగే టటువంటి మార్గాలు ఏర్పరుస్తామో, మనం అవి చూడుకోవాలి. నా ఉద్దేశ్యములో ఎక్కడ చూచినా, ఏ పని చేసినా, ప్రజలకు కావలసినవి ఎవరూ చేయకపోతే, మాబోటివాళ్ళు అక్కడికి వెళ్ళితే, ఆంధ్రరాష్ట్రం వచ్చింది, మీరు మాకు యే సహాయము చేస్తారని అడుగుతారు. Communist Party Principle నాకు తెలుసు. అది ఎట్లాపైకి వచ్చిందోగూడా నాకు తెలుసు. Elections లో ఏ విధంగా గెలిచింది నాకు తెలుసు, మీరుచేసిన prpaganda యేవిధంగా వున్నదంటే, మాలోట్లుచూచి, ప్రజలతో "మీకు అన్నం లేదు", 'గుడ్డలేదు', కష్టక మేము ప్రభుత్వంలోకి

గ్రామాలలో ఉండి ప్రజలకు మీరు చేసే దృష్టాంతపని కూడా మానుకున్నారని బాధపడం. మీరు తీవ్రవంగా మాట్లాడడం, యీ శాసనసభలో Law points అన్ని ఎత్తడం అక్కడ Composite State Assembly Speaker Sivashanmugam Pillai మాదిరిగా కాకుండా యిక్కడ వెంకట్రామయ్య చౌదరిగారి ఎదుట వేసే law point మీరు వేస్తే చేసే కార్యక్రమం ఏమీ వుండదు, మీరు గ్రామాలకు వెళ్ళి ప్రజలకు ప్రబోధం చేసే అవకాశం లేకుండా పోయింది. నాకు కుండ సంతోషమే. నేను ఆలోచించుకోవడములో Communist party ఎంత త్వరగా పోయేది చూస్తున్నాము కదా! మనం ఏమి చేయడం, ఎట్లా చేస్తాము అని ఆలోచించుకుంటే దానికి కావలసిన కార్యక్రమం అంతా కూడా ఇప్పుడు ఏదో రాబోతుంది అని అంటే వారు అమెరికా వెళ్ళమని, రష్యా వెళ్ళమని చెబితే, ఈ రష్యా చైనా, అమెరికా దేశాల విషయములో ఎవరైనా మనకు ఏమైనా, ఉపకారము చేస్తున్నాగా అనేది పరిశీలించి చూస్తే మనము ఎట్టిఅవకాశాలు లేకుండా పెట్టుకుంటున్నాము. మీరు అందరు ఒకతాడుమీద నడిచి లేని పోని వాదాలు, కథలు పెట్టుకోకుండా పనిచేసుకుంటే బాగుంటుంది. గత డిమాండును నేను move చేసినప్పుడు మీరు యీ cut motion తీసుకొచ్చిపెట్టారు. ప్రతిదానికి ఒక cut motion తెచ్చి, కార్యక్రమానికిఅడ్డమువస్తూవుంటే యీ కార్యక్రమము నడిచేది ఎట్లాగు? మనపని పూర్తి చేసుకోవడం చూడాలి కాని, అడ్డాలు వద్దంటున్నాను. పని సాగిపోనివ్వండి. మీకు నామీద విశ్వాసము వుటుందని మనం యీ కర్నూలు తాత్కాలికంగా నిశ్చయించుకొని రాజధానిని కొద్దికాలము వుండడానికి పెట్టుకున్నాము. ఇక్కడనే శాశ్వతముగా వుంటామని నేను చెప్పడము లేదు. తాత్కాలికమనే చెప్పుతున్నాను. ఆవిధంగా statements కూడా యిచ్చాము. అదిఅంతా అయిపోయింది. కాబట్టి యిప్పటికైనా మీరు అంతా ఒకవిధంగా ఆలోచించడం మంచిది. బంజరుభూములు కట్టడములు వగైరా పనులు మన ముందు ఎన్నో వున్నవి. మనమందరికి ముందుముందు పెద్దపెద్ద సమస్యలు సమంజసమైనవి వున్నవి. అవన్ని ఏదో విధంగా జరుపుకోవాలి. ఈ విషయాలన్ని వూరికనే మాటలతో అయ్యే పనులు కావు. అన్నింటికి ఒకప్లాను వేసుకొని దాని ప్రకారము

అవకాశం ఉన్నా 5 కోట్లరూపాయల స్కీములన్నీ తీసుకువచ్చాను. మనము వేసిన ప్లానులు ఎవరుకూడా ఒప్పుకోనరు. ఇంజనీర్లు రావలెను. ప్లానులు వేయవలెను. అన్నివిధాల కష్టపడ్డవారము మనము. దేశంలో ప్రజలు మనలను నమ్ముకున్నారు. గాని మనం ఏమీ చెయ్యలేకపోయినాము. ఒక తాటిమీద నడిపించే అవకాశం ఈ నాడువచ్చింది. అందుచేత ఈ బడ్జటువిషయంలో కాపిటలుమాట ఎత్తకండి అనిచెబుతున్నాను. ఈబడ్జటు ప్యాసుకానీయండి తరువాతబడ్జటులో ఏమిజరుగుతుందో నేను చెబుతాను. కార్యక్రమాలు చాలావున్నాయి.

శారదానదిమీద ఎన్నోస్కీములున్నాయి. అరండేలుడాము అన్నారు. తరువాత ఇంకొకటిఅన్నారు. నేను చూచివచ్చినాను.

నాకు ఉండే స్టేటుఆఫ్ హెల్తుతో మీవద్ద కూర్చోనగలనో లేదో నాకు సందేహము వేసింది. నెహ్రూకూడా నాకు పోర్టుపోలియోలేని మంత్రిపదవియిచ్చి కూర్చుంటే బాగుండును అని అన్నారు. గాని నేను పోర్టుపోలియోలేకపోతే కూర్చునేమనిషిని కాదు. ఈనాడు పోర్టుపోలియోలు అన్నీ నావే అయినాయి. నాకు తెలియకుండా ఎవరూ ఏమీచెయ్యరు. వారికి తెలియకుండా నేను ఏమీచెయ్యను. సంజీవరెడ్డి ప్రకాశంమీదకూర్చోనిఏమో చేస్తున్నాడంటున్నారు. ఇది పొరపాటు. సంజీవరెడ్డి ఏమి చేస్తాడో నాకు ఈనాడు తెలిసింది. నేను ఒకచోట శాశ్వతముగాఉండేవాడనని ఒప్పుకోను. ఈ Chief Minister గా ఉండేవాడినికాను. C. V. K. Rao ప్రొద్దున అన్నాడు నేను నా కొడుకును సెక్రటరీగా పెట్టుకున్నానని. గతిలేక పెట్టుకున్నాను. నేను నాఅంతకునేను నడిచేస్థితిలో లేను. ఒకరి సహాయంకావలసిన స్థితిలోఉన్నాను. నా కొడుకు ఏరోప్లేనులో నుంచి క్రిందపడిపోయి 500/- జీతం తెచ్చుకునే ఉద్యోగానికి రిజిగ్నేషనుఇచ్చి వచ్చినవాడు. లక్షలకు అధికారికావలసినవాడు నన్ను ఈరోజున కూర్చోమంటున్నాడు. ప్రైవేటు సెక్రటరీగా ఉండి పనిచేసేదానికికాదు. నావద్ద మనిషికూడావుండి నడిపించవలసిన స్థితిలో ఉన్నాను. పోర్టుపోలియో లేకుండా పనిచెయ్యమని అన్నారే గాని నేను అవిధముగా ఉండేవాడినికాను.

నాకుమారుడు నాకంటెకూడా చాలా చిత్రమైన మనిషి. అయితే వాడిని Aeroplane లో Pilot గా పెట్టడానికి చాలా చరిత్ర ఉన్నది. అది అంతా మీరు తెలుసుకోవలసిన

అవసరం లేదు. వాళ్ళు లక్షలకు కోట్లకు యజమానులుగా ఉండవలసిన వాళ్ళు. A Pilot క్రింద వెళ్ళాడు. అటువంటి మనిషిని గతిలేక విధిలేక పెట్టుకున్నాను. మీకు ఏవిషయంలోను ఏ కార్యక్రమంలోను అడ్డురాడు. మీరు అందరూ సుముఖంగా ఉండి అన్ని విషయాలలోనూ నాతో కలిసి పనిచేస్తే, అన్ని విషయాల్లోను, అన్ని కార్యక్రమాలలోను ప్లాను వేసి వాటిని చేయడానికి వీలుగా ఉంటుంది. ఇప్పుడు మీరు అంతా నాతో కలిసి పనిచేయడానికి సుముఖంగా వుండాలి, అందుకు తగినంత అవకాశం, scope ఇప్పుడు వచ్చింది. scope పూర్తిగా వచ్చింది. Scope పూర్తిగా రాకపోతే స్నేహితులతో కలసి నేను ఈ పరిస్థితులను ఎదుర్కొనడం సాధారణంగా సాధ్యమైన పనికాదు. నాకు సంగతులు అన్నీ ఇంకా మాట్లాడడానికి అవకాశం ఉన్నా కాని వాటికోసం మిమ్మల్ని ఆపకుండా నేను ముగించుతున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAIAH:—I. C. S. ఉద్యోగుల వేతనం విషయంలో, దస్తావేజు లున్నాయని అన్నారు. ఆ ప్రకారం వారికి వేతనాలు ఇవ్వవలయును అన్నారు. మంత్రుల జీతమును హెచ్చించడంకోసం మంత్రులకుకూడా అలాంటి వేమయినా ఉన్నాయా అని నేను అడుగుతున్నాను.

The Hon. Sri T. PRAKASAM — I. C. S. Officer కు Bond లు ఉన్నాయి. Registration లు ఉన్నాయి. కాని మంత్రులకు అలాంటి వేమీ లేవు. ఇందులో కొంతమంది మంత్రులు యిది వరకు 500 రూపాయలు జీతం తీసుకున్న వారే. వారందరికి ఈ వేళ ఈపరిస్థితులనుబట్టి, 500 రూపాయల జీతం సరిపోదని గవర్నరుగారు ఆర్డరు పంపినారు. ఈ రోజున ఉన్న పరిస్థితులనుబట్టి మంత్రులకు 500 రూపాయల జీతమయితే, నేను యిదివరలో లక్షలకు లక్షలు సంపాయించి నప్పుడు నేనూ ఖర్చుపెట్టాను. నేను కొంతకాలం ఏమీ లేకుండా నే వెళ్ళబుచ్చాను. మంత్రులలో కొంతమంది ఇదివరలో 500 రూపాయల జీతం తీసుకున్నవాళ్ళే. కాని ఈ వేళఉన్న పరిస్థితులను బట్టి వారికి 500 రూపాయలు సరిపోకపోవచ్చు. అందుచేత ఈ విషయంలో ఈ పరిస్థితులలో రవ్వంత, మీరు అందరూ ఆలోచించుకోవలసి యున్నది. ఇందాకా మోటారు కార్ల సంగతి గురించి చెప్పారు. మోటారుకార్లు లేకపోతే

నేనక్కడికి ఎలా తిరగ గలను. మోటారుకారు లేకుండా నాపని ఎలా జరుగుతుంది. 12 జిల్లాలు, 16 రోజులలో తిరగ గల్గాను అంటే.

Sri PILLALAMARRI VENKATESWARLU — పంతులుగారు నేనిందాకా చెప్పినదానిని mis - understand చేసుకున్నారు. నేనుచెప్పినది వేరు.

The Hon. Sri T. PRAKASAM — నీవు ఏమి చెప్పినా నేను mis-understand చేసుకోను, కూర్చో.

DEPUTY SPEAKER — ఇప్పుడు 9 వ Damand మనం చర్చచేశాము. "Heads of States, Ministers and Head quarters Staff." అనేదానిక్రింద ముఖ్యమంత్రిగారు 17,67,300/- రూపాయలను ఈ డిమాండులో కోరారు. దీనిమీద cut motion. 32 వ cut motion, "To reduce the allotment of Rs. 17,67,300 for Heads of States, Ministers and Head - quarters Staff by Rs. 100." మీరా అందరియొక్క అనుమతికొరకు యీ cut motion ను అనగా ఈ కోతతీర్మానాన్ని ఈసభముందు పెడుతున్నాను. The queston is :

"that the allotment of Rs. 17,67,300 under Demand IX. Heads of States, Ministers and Headquaretrs staff be reduced by Rs. 100/-

The motion was lost.

DEPUTY SPEAKER - Cut motion వీగిపోయింది.ఇప్పుడు 9 వ Demand సభయొక్క అనుమతికోసం ఈసభ ముందు పెడుతున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :— ఉపాధ్యక్షా, point of order ! ఏమిటంటే ఒక కోతతీర్మానాన్ని తీసుకున్నారు. దానితరువాత ఇంకా తక్కిన కోత తీర్మానాలను తీసుకోకుండా వదలివేశారు. తక్కిన కోతతీర్మానాలను తీసుకోకుండా Main Demand ను తీసుకున్నారు. మిగతా తీర్మానాలను వదలివేశారు. అది ఏ సాంప్రదాయము ప్రకారం సరికాదు. సౌకర్యానికి చేశామంటే సరేగాని అది సాంప్రదాయంగా తీసికోబడకూడదని అందుపై వివరించవలసినదిగా కోరుచున్నాను.

DEPUTY SPEAKER — అన్ని కోతతీర్మానాలు 100రూపాయలకేవున్నాయి కాబట్టి, సాంప్రదాయంక్రింద వదలివేశాను,

Sri T. NAGI REDDI — ఉపాధ్యక్షా! ఒక చిన్న మనవి చేయాలి. ఇచ్చినటువంటి cut motion లలో చేసినట్లు, ఎన్నైనా Press చేసినట్లైతే అది ఓటుకు పెట్టాలి. అందుచేత ప్రతి Press చేయలేక పోయినట్లయితే తక్కిన కోత తీర్మానాలను ఒకదాని తరువాత ఒకటితీసుకొనవలసియుంటుంది. ఇది మద్రాసు శాసనసభా సాంప్రదాయం. అందుచేతను, ఈ కోత తీర్మానాన్ని Press చేయలేదు కాబట్టి దీని తరువాత మిగతా కోతతీర్మానాలను, దీనిని వదిలిపెట్టి ఒకదాని తరువాత ఒకటి తీసుకోవాలని నేను అనుకొంటున్నాను.

DEPUTY SPEAKER — మీ కోర్కెమేరకు అనుమతించెడి. దీనిని సభాఅనుమతికోసం సభముందు పెట్టుచున్నాను. The Question is

"That the Government be granted a sum not exceeding Rs. 17,67,300 under Demand IX" Heads of States, Ministers and Headquarters staff.

The motion was carried.

DEMAND No. XIV - Police

The Hon. Sri N. SANJEEVA REDDI — Deputy Speaker, Sir., I move that the Government be granted a sum not exceeding Rs. 1, 23, 34, 500 under Demand No. XIV - Police.

ఉపాధ్యక్షా! సాధారణంగా ఈ పోలీసు డిమాండుపైన విపరీతమైన చర్చలు వాదోపవాదనలు జరగడం ప్రతిరాష్ట్రములోను ఆచారంగా వస్తూయున్నది. కాని ఇప్పుడు మాత్రము ఉత్సాహమంతా ఇతర విషయాలమీద ఉన్నందువల్ల ఈ పోలీసు డిమాండు చప్పగా ఉన్నది. పోలీసువాళ్ళయొక్క డిమాండుపైన ఉండవలసిన ఆ ఉద్రేకత ఆకారము కన్పడలేదు. కనుక సభ్యులందరు దీంట్లో ఏమి కోతతీర్మానం లేకుండా సహకరిస్తారని ఆశించడానికి అవకాశం ఏర్పడింది. ముఖ్యంగా పోలీసుడిమాండుపైన పూర్వపు రోజులలో అనగా మనము బానిసలుగా ఉన్న రోజులలో విపరీతముగా వాదన చేయవలసి ఉండేది, అయితే ఈనాడు పోలీసువారు ప్రజలను అణచిపెట్టడానికి కావలసిన machine గా కాకుండా ప్రజాక్షేమాన్ని రక్షించడానికి అన్ని విషయాలను చట్టసమ్మతంగా కాపాడడానికి ఉపయోగించ

బడుతున్నారు. కాబట్టి దీన్ని విమర్శించ వలసిన అవసరంలేదు. ఈ డిపార్టుమెంటులో ఏవైనా పరిపాలన లోపాలు యేమాత్రము వాటిని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వచ్చినట్లైన, వాటిని ప్రభుత్వము గమనించి, సవరించుటవారి ధర్మమైయున్నది.

ఇక పోలీసు ఉద్యోగస్తులగురించి మాట్లాడుతున్నప్పుడు ఈ constables మొదలగు చిన్న ఉద్యోగస్తులకు జీతాలు చాలా తక్కువని వాదించడం చాలా ప్రాముఖ్యంగా ఉంటున్నది. ఆ విషయాన్ని విమర్శించడం చాలా సులభం కూడ. ఎందుకంటే మంత్రులకు 5 వందలే చాలనప్పుడు constables కు ఏవిధంగా 40 రూపాయలు చాలుతుందని, compare చేసి చెప్పగలగడం చాలా సులభము. ఆ రకంగా comparative గా తీసుకొని, సెక్రటరీలకు 2 వేలు, 3 వేలు ఎందుకని, మంత్రులకు వెయ్యి, 5 వందలు ఎందుకని అంటే, మరొకరు శాసనసభ్యులకు దినానికి 12 రూపాయలు బత్తా 150 రూపాయలు జీతము ఎందుకని అడుగుతారు. ఈ విధంగా దీన్ని reconcile చేయడం కష్టము. కనుక general గా ఎవరికిగాని నూరురూపాయల కంటె జీతము తక్కువ ఉండకూడదనేది అంగీకరించిన విషయమే అయితే ఆవిధంగా ఎప్పుడు అనులుపరచగలము, ఏపరిస్థితులలో అనే విషయమును గురించిఆలోచించుకోవలసియున్నది constables కు గాని, గుమాస్తాలకుగాని ఎవరికైనగాని, వందరూపాయలకంటె తక్కువ ఉండకూడదని, మొత్తంమీద చిన్న పెద్ద ఉద్యోగస్తుల జీతాలు నూరు రూపాయలకు, వెయ్యి రూపాయలకు మధ్యలో ఎక్కువ తేడా లేకుండా ఉండవలెననేది, ఇది కమ్యూనిస్టులు చెప్పినప్పటికిని, మరెవరు చెప్పినప్పటికిని, అందరు అంగీకరించిన విషయమే. అయితే దానికి తగిన పరిస్థితులు రావలసియుంటుంది. ఇప్పుడు ఈ constables జీతాల విషయంలో ఇతర డిపార్టుమెంట్సులో ఉన్న చిన్న ఉద్యోగులయొక్క జీతాలతో compare చేసిచూస్తే ఈ constables యొక్క జీతాలు అలవెన్సులు అన్ని కలిస్తే ఎక్కువగానే వస్తున్నది. ఎందుకంటె వారికి 40 రూపాయల జీతంతోపాటు, dress కు గాను ఒక 40 రూపాయలు ఇస్తున్నారు. House rent కు గాను ఒక 19 రూపాయలు ఆమాదిరి ఇస్తున్నారు. తరువాత బత్తాలుకూడ వస్తూంటుంది. ప్రస్తుతం మనదేశములో పరిస్థితులు చూచినట్లైతే, నిజంగా ఎంతమంది ఈ చిన్న ఉద్యోగస్తుల కంటె

ఎక్కువ హీనస్థితిలో ఉంటున్నారో గమనించవలెను. అటువంటి వారినంతా పోల్చి చూస్తే, మీకు ఎంతో తగవా లేదని అవుతో వలసియుంటుంది. అయితే ఈ ఉద్యోగస్థులకు ఇస్తున్నటువంటి జీతాలు తక్కువ అనుకోండి. వాటిని ఇంకా ఎక్కువ చేయవలెననే కోరిక అందరికి ఉన్నది. మనకు ఇంకా మంచిరోజులువచ్చి, ఆర్థికంగా పెంపొందినప్పుడు వీరితోపాటు ఇతర చిన్న ఉద్యోగస్తుల జీతాలను వందరూపాయలకు హెచ్చు చేయడానికి ప్రభుత్వము గాని, మంత్రులుగాని, సంకోచింపరు. వాటిని హెచ్చించే అవకాశ ముంటే వెంటనే హెచ్చించి, ఆ ఆనందాన్ని గౌరవాన్ని మేమే పొందేవాళ్ళము గాని మీరు ఆక్షేపించేవరకు ఉండియుండము. ఇంకా పెద్ద ఉద్యోగుల విషయములో అయితే, వారు చాలా కొద్దిమందే ఉంటారు గనుక, వారి జీతాలు హెచ్చించినా మొత్తమీద ప్రభుత్వానికి అంత హెచ్చు ఖర్చుగా కనపడదు. అయితే చిన్న ఉద్యోగస్తులు చాలామంది ఉంటారు గనుక, వారి జీతాలు ఏకొంచెము అనగా రెండు రూపాయలు హెచ్చించినప్పటికిని కొన్ని లక్షలకు వస్తుందనే విషయము అందరికి తెలిసినదే, కాబట్టి పూర్వపు ధోరణిలో కాకుండా, ఇప్పుడున్న పరిస్థితులను గమనించి ఏది సాధ్యము, ఏది కాదు అని ఆలోచించవలెనని కోరుతాను. ఈ మధ్యన పంతులుగారు అందరికి ఒక appeal చేసుకొన్నారు. మన మందరు కలిసి పనిచేసుకోవలసిన రోజులివి అని చెప్పారు. కనుక, మనకు కార్యక్రమం ఎంతో ఉన్నప్పుడు ఇటువంటి చిన్న విషయాలలో ఎక్కువ భేదాభిప్రాయాలు లేకుండా సహకరించవలసియుంటుంది. మనం కనీసం కొంత కాలనియమాన్ని అయినా పాటిస్తే బాగుంటుందని అనుకొంటాను. ఇప్పుడు ఆంధ్రరాష్ట్రంలో పోలీసు బడ్జెట్‌లో ప్రత్యేకంగా చెప్పుకోదగినంత ఏమి లేదు. అదృష్టవశాత్తు ఆంధ్రరాష్ట్రంలో అరాచకాలు ఎక్కువ లేవు. అయితే పోలీసువారికి ఎక్కువమందికి పని ఉండదని చెప్పవచ్చు. కాని పోలీసువారికి ఎప్పుడు పని ఉంటుంది. ఎప్పుడు ఉండదని చెప్పడానికి వీలులేదు. ఏ సమయము ఎట్లావుంటుందో ఎప్పుడు ఎక్కడ ఏమిజరుగుతుందో చెప్పలేము కాబట్టి అలాంటి సిబ్బందిని ఉంచుకోక తప్పదు.

తరువాత ఇప్పుడు ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన ఫలితంగా కొద్దిగా పైఅధికారులు ఎక్కువ కావలసివచ్చింది.

ముందు మద్రాసురాష్ట్రానికంతకు, common గా, ఉండిన అధికారులు, ఇప్పుడు మనకు ప్రత్యేకంగాఉండవలసిన అవసరం ఏర్పడింది. ఆవిధంగా మనకుప్రత్యేకంగా ఒక I. G. అని, D. I. G. అని, కొంతమంది D. S. P. S. అని మొదలగు అధికారులను నియమించవలసివచ్చింది, ఈ సందర్భంలో కొంత హెచ్చు ఖర్చు పెట్టవలసివస్తుంది. తరువాత ఈ పోలీసువారి విషయంలో, buildings కు గాను, వారికి ఇళ్ళకుగాను హెచ్చు మొత్తము పెట్టవలసివస్తున్నది. పోలీసుస్టేషన్లు ఉండేచోటనే, వీరికి ఇళ్ళు ఉండవలసియుంటుంది. ఇప్పుడు చాలాచోట్ల వారికి ఇళ్ళులేవు. వాటిని కట్టడానికి కృషిచేస్తే ప్రతిసంవత్సరం కొన్నిలక్షలు ఖర్చు అవుతుంది. ఇప్పుడే ఒక file చూస్తిని, దాంట్లో మద్రాసులో వీరి ఇళ్ళ బాడుగలకుగాను 24 లక్షలు ఖర్చుఅవుతున్నదని ఉన్నది. ఎందుకంటే అక్కడఉన్న పోలీసుఉద్యోగస్థులు, constables కాకుండా Head Constables, Sub - Inspectors, వీరికంతా ప్రత్యేకంగా buildings లేనందున అందరు బాడుగ ఇళ్ళలో ఉంటున్నారు. వాటిబాడుగకుగాను 24లక్షలు ఖర్చు అవుతున్నది. అయితే మనకు అంత ఖర్చుకాదనుకోండి. కాని ప్రతిసంవత్సరం నాలుగో, పదో బిల్డింగులు కట్టుకొనవలసియుంటుంది. ఎందుకంటే పోలీసుస్టేషన్లకు దగ్గరలోనే, వారి యిళ్ళు ఉన్నట్లయితే Constable వెంటనే పలకడానికి, ఏ emergency కైనా వెంటనేవాళ్ళు available గా వుంటారు. నోటీసుఇచ్చి ఎవరు కూనీలుచేసుకోరు. కడప కర్నూలుజిల్లాలలో ఈవిధంగా నోటీసుఇచ్చి చేసుకొంటారేమోగాని, అన్నిజల్లాలలో ఈ విధానాన్ని అవలంబించరు. కనుక emergency విషయాలలో, వారికి ఇళ్ళు దగ్గరలోలేకున్నట్లైతే, కష్టముగాయుంటుంది. ఇళ్ళు అక్కడనే పోలీసుస్టేషనుకు దగ్గరలోనేఉంటే, సబ్ఇన్స్పెక్టరు ఎప్పుడుపిలిస్తే అప్పుడు పలకడానికిగాని, Constables కూడ తమ సంసారాన్ని భార్యాబిడ్డలను చూచుకొంటూ, వాళ్ళపనులను సరిగా నిర్వహించడానికికూడ అవకాశముంటుంది. కనుక సాధారణపరిస్థితులల్లో వీరికిఇళ్ళు కట్టడమునకుగానుకొన్ని లక్షలు ఖర్చుఅవుతూఉంటుంది. తరువాత Administration expenses అంతాకూడ ఉంటాయి. ఎక్కడైన అరాచక చర్యలు జరిగితే, ఒకజిల్లానుండి, ఇంకోజిల్లాకు వీరు పోవలసియుంటుంది. అటువంటి సందర్భాలలో కొన్నిఖర్చులుఉంటాయి,

లేదు. అంటే ప్రభుత్వ యంత్రం చట్టాలకు లోబడి నడుస్తుంది. చట్టాలకు లోబడకపోతే శిక్షించుటకు వీలుంటుంది. కాని అటువంటి కఠినమైన శాసనాలు అమలు పరిస్తే, నిజంగా దుర్మార్గుడు కాని వాడిపైన తప్పుడు అభాండాలు వేయబడినప్పుడు, అట్టివాళ్ళను శిక్షిస్తే మనం తప్పుచేసిన వారమవుతాం. నిజంగా నేరంచేసిన వారిని శిక్షించుటకు ప్రభుత్వం వెనుదీయదు. లంచగొండులని గాని క్రూరంగా ప్రవర్తిస్తున్నారనిగాని తెలుసుకుంటే, ప్రభుత్వ దృష్టికి తెస్తే అలాంటివాణ్ణి రక్షించుటకు ప్రభుత్వం పూనుకోదు. శిక్షించుటకు వెనుదీయదు. వారు చేస్తూయున్న కార్యక్రమం సులభమైనదికాదు. రాత్రి, చీకటి, ముళ్ళు, వాన అనకుండా క్రిందివారంతా చాలా శ్రమపడి పని చేస్తున్నారు, వారికే ఎక్కువ ఖర్చవుతుంది. పదివేల మంది Constables ఉన్నారు. Head Constables, Sub-Inspector లూ, సార్జంటులూ ఉన్నారు. వారందరూ శ్రమపడి పనిచేస్తూయున్నారు. వారికి సంపూర్ణమైన సహకారమిచ్చి, వారి కార్యక్రమం సులువుచేస్తే మన రాష్ట్రశ్రేయస్సుకు తోడ్పడిన వారవుతారని అనుకుంటున్నాను. నేను ప్రత్యేకం చెప్పవలసిన విషయాలులేవు. మీరు చెప్పవలసింది వుంటే, సలహాలిస్తే ప్రత్యుత్తరంఇవ్వడంలో సమాధానంచెబుతాను.

DEPUTY SPEAKER — The motion is that the Government be granted a sum exceeding Rs. 1,23,33,500 under Demand XIV Police.

Sri M. VEERABHADRAM — Mr. Speaker Sir I beg to move

"that the allotment of Rs. 1, 23, 33, 500 under Demand XIV, Police, be reduced by Rs. 100"

ఉపాధ్యక్షా! కోతతీర్మానం ప్రతిపాదిస్తున్నాను.

Sri T. POTHA RAJU — ఉపాధ్యక్షా! పోలీసు demand 123 లక్షల రూపాయలకు కోరుతూ ఉపముఖ్య మంత్రిగారు ఇచ్చిన ఉపన్యాసం శ్రద్ధగా విన్నాను. అందులో ఇంతకు ముందున్నటువంటి దృక్పథం పోలీసువారి యెడల మనకుండ కూడదు. మార్చుకోవాలని చెప్పారు. ఐతే మనమిప్పుడు చూడవలసింది ప్రతిపక్షం పోలీసు Constables యొక్క సానుభూతి పొందాలని వారి

(Sri T. Potha Raju) [7th January 1954

జీతాలు పెంచాలనే ఒకే నినాదం తీసుకు వస్తోందని అనుకోకూడదు. నేను ముఖ్యంగా చెప్పదలచుకున్నది, ఈ ముఖ్యమంత్రి వింటారని అనుకుంటున్నాను. ముఖ్యంగా ఇప్పుడు మన Constitution మన భారత ప్రజలకు అన్ని పౌరసత్వ హక్కులను ఇచ్చామని individual dignity కాపాడడం Constitution యొక్క విధియని poster లలో చూస్తూ ఉన్నాం. ప్రధానంగా దాన్ని ఆచరణలోనికి ఎంతవరకూ తీసుకు వస్తున్నారనేది పోలీసు శాఖ మీద ఆధారపడి యున్నది. ఇతర కారణాలుకూడా ఉండవచ్చును. గాని ఇప్పుడున్న సమస్య — ఇప్పుడున్న పోలీసుశాఖ ప్రజల పౌరసత్వహక్కులను, individual dignity ఎంతవరకు కాపాడుతోంది అనేది మనం ఆలోచించాలి. వాక్స్వాతంత్ర్యము, వ్యక్తికా స్వాతంత్ర్యం విషయంలో దాని ఆచరణచూస్తే City Police Act క్రింద ఇప్పుడు అమలులో యున్న విషయాలు బెజవాడ పట్టణంలో చూస్తున్నాను. ఇతర ప్రాంతాలలో కూడా అల్లానే ఉన్నదని విన్నాను. బెజవాడ city లో Mikes పెట్టుకొనుటకు Permission కు apply చేయ్యాలి. లేకపోతే మాట్లాడుటకు వీలులేదు. ఇది వ్రాతమూలకంగా Circle Inspector వారికి, డిప్యూటీ సూపరింటెండెంటుగార్కి ఇస్తే సరిపోదు. తాలూకాకు వెళ్ళాలి. ట్రజరీలో చెలానుకట్టాలి. అప్పుడుగాని పర్మిషన్ ఇస్తారో లేదో తెలియదు. అది కాకపోతే ఇంకా bank కు కూడా వెళ్ళి డబ్బుకట్టవలసి యుంటుందంటే తాలూకాచుట్టూ తిరగాలంటే, దీని కంతకూ ఎంత ఖర్చవుతుందో చూడండి. మీటింగు పెట్టుకొనుటకు హక్కు ఉన్నా, ఆచరణలో మీటింగులు పెట్టుకోడం ఎంత దుస్తరమో, మీకు తెలుస్తోందనుకుంటాను. పోలీసు డిపార్టుమెంటులో మామూలు Constables కు పైనున్న పోలీసు అధికార్లనూ, దృష్టిలో పెట్టుకుంటే, ఇంతకు పూర్వం ఉండేదానికీ, ఇప్పటికీ ఏమీ తేడాలేదు. పోలీసువారు అనుసరిస్తూ ఉన్న విధానం చూస్తే, ప్రజల కోసం ఏమాత్రం పనిచేస్తున్నారో, ప్రజలను కాపాడుటకు ప్రజల రక్షక భటులుగా ఎంతగా పనిచేస్తున్నారో చూస్తే, మామూలు బీద రైతులూ, వ్యవసాయ కూలీలనూ, భూములలో నుంచి evict చేయుటకు యజమానులు ప్రయత్నం చేస్తూంటే, యజమానుల తరఫున పోలీసువారిని పంపడం, ఆ విధంగా వ్యక్తిగతంగా కూడా మెచ్చుకోవడం జరుగుతోంది. ఎక్కడైనా కార్మికులు తమ వేతనాలకోసం సమ్మె చేస్తూంటే మన దేశంలో B. I. T. లో సమ్మె జరిగిన విషయం మీకు తెలిసిందే అక్కడ పోలీసువారు వచ్చి English యజమానుల తరఫున కార్మికు

లపై లాఠీచార్జి చేయడం; బాష్పవాయువు ప్రయోగించడం సర్వసామాన్యమై పోయింది. కష్టాలకు గురిఅవుతున్న ప్రజలతరఫున నిలబడుతున్నారా అంటే ఉదాహరణకు బెజవాడలో కన్యకా పరమేశ్వరీ groundnut oil mill లో lock out జరిగినప్పుడు అక్కడ యజమాని తనమీద కార్మికులు దౌర్జన్యము చేస్తున్నారని తప్పుడు report ఇచ్చి పోలీసులను పిలిపిస్తే కార్మికుల representations వినకుండా, Police report ఇచ్చి యజమాని అన్ని ప్రయత్నాలూ చేయగలిగాడంటే, దీన్ని బట్టి పోలీసు Department పై ప్రజలకు ఎట్టి అభిప్రాయం ఏర్పడుతుందో ఆలోచించాలని కోరుతున్నాను. రాష్ట్రం మొత్తంలో ఎప్పుడు పెట్టుబడిదారు కార్మికుల సమస్య వచ్చినా పెట్టుబడిదారుల తరఫున నిలబడతారు గాని పోలీసు బీద ప్రజల తరఫున నిలబడడంలేదు. లంచగొండి తనం మామూలుగా ఉన్న విషయమే. అది సభ్యులకు కూడా తెలుసును. ఏమి మార్పు వచ్చిందంటే Sub Jails లో గాని, lock up లో గాని ఏమి జరుగుతోందో అనేక ఉదాహరణలు ఇవ్వగలను.

యథా ప్రకారంగా సబ్ జైల్సులో పెట్టడం ఎక్కడా జరగలేదు. Lock up జరిగిన 24 గంటలలోగా సబ్ జైలుకు పంపాలి అనేదివున్నా అలాజరగడంలేదు. పై officers దృష్టికి తీసుకువచ్చాము కాని ఏ చర్య తీసుకోబడలేదు బెజవాడలో సూర్యారావుపేట No. 4 Law and Order Police Station లో 3 మాసాల క్రితం జరిగింది చెబుతాను. సబ్ ఇన్స్పెక్టరు పేరుకూడా చెబుతాను-నరసింహారావుగారు. ఇప్పటికీ ఆయనేవున్నారు. నలుగురు ఆడవాళ్లను lock up లో పెట్టారు. తీరా protest చేస్తే record చేయలేదు. కేసుకూడా లేదు. Enquiry స్థితి వచ్చేసరికి వదలిపారేశారు. Enquiry ఏర్పడే పరిస్థితివస్తే record కూడా వుండదన్నమాట. ఆ పోలీసుస్టేషనులో అనేకమందిని ఆవిధంగా తీసుకువచ్చి చితుకకొట్టడం విజయవాడలాంటి ముఖ్యకేంద్రంలోనే జరుగుతోంది. ఇలా lock up లో పెట్టి అనేకమందిని ఎందుకు కొట్టాల్సివస్తుందో నాకు అర్థంకాదు. వీళ్ళమీద దెబ్బలుకొట్టడం సామాన్యమైనవిషయం. పై అధికారులకు తెలియజేసినా చర్యతీసుకోవడం వుండదు. ముత్యాలనుంచి వచ్చిన ఒకాయనను విజయవాడ సబ్ జైల్లో వేసి విపరీతంగా కొట్టడంజరిగింది. పత్రికల్లో కూడ ఈవిషయం ప్రకటించబడింది. వాళ్ళమీద ఏ action తీసుకోలేదు. మర్యాదవారం అంటూ పేరుకుమాత్రం జరుపుతూవుంటారు. ఈ సూర్యారావుపేటలోనే ఒక స్త్రీమీద వ్యభిచారి అంటూ కేసుపెట్టారు. ఫలానావారికి

ఆమెకు సంబంధంవుంది అందుచేత ఆమె వ్యభిచారిఅని కేసుపెట్టారు. చివరకు విచారణఅయ్యాక ఆమెకు సంబంధంవున్నది అన్న ఆయన ఆమె భర్తఅని తేలింది. కేసు కొట్టివేయడంజరిగింది. ఇట్లాంటి అధికారులు మనకువున్నారు. ప్రజలకు పోలీసులకు వున్న సంబంధం బాగుపడాలంటే ఇదేనా మార్గం అని నేనడిగేది. విజయవాడతాలూకా పోలీసుస్టేషను సబ్ ఇనస్పెక్టరు, సర్కిల్ ఇనస్పెక్టరు వున్నారు. ఎందుకువీళ్ళు భూస్వాములతరఫున పెట్టుబడిదారులతరఫున నిలబడుతున్నారు? ఏమన్నా అంటే కమ్యూనిస్టులు అంటున్నారుఅంటారు విజయవాడ తాలూకాలో తాడేపల్లిగ్రామంవున్నది. అక్కడ ఒక రాజుగారు పంచాయితీబోర్డు ప్రెశిడెంటు ఎలక్షన్లలో తనకువోటు ఇవ్వలేదని ఒక హరిజను నింగబుదురాడకు రౌడీలనుపంపితే రిపోర్టుచేస్తే విచారించేవాళ్ళ లేకుండాపోయారు. కక్ష సాధించడానికి శవాన్ని పాతిపెట్టించారు. వరుసగా 4, 5 రిపోర్టులు వున్నాయి, అవి సీనియరుఅధికారులదృష్టికి తీసుకువచ్చాము. Enquiry జరుపుతాంఅన్నారు. D. S. P. గారు Enquiry జరిపింది అసర్కిలు ఇనస్పెక్టరే. ఆ రాజుగారుగ్రామంలో ఒక పెద్ద పెత్తందారు. ఇంకా పైపెచ్చు కాంగ్రెసువాది, కాబట్టి దబాయించి విచారణసమయంలో కొన్ని incidents చెబుదామనివచ్చినప్రజలను చెప్పింది వినకుండా పంపించివేసి ఆయనచెప్పింది వేదవాక్యంగా వ్రాసుకుని వెళ్ళిపోయాడు. రక్షణఇవ్వడం జరగడంలేదు. 1, 2 భూస్వాములకు మాత్రమే రక్షణ, మిగతావారికి భక్షణ. విజయవాడ తాలూకా సర్కిలు ఇనస్పెక్టరు సూరయ్యచౌదరిగారు, సబ్ ఇనస్పెక్టరు రామయ్య ఈవిషయంలో తాము రిపోర్టుఇస్తే విచారణలేదు. అంతేకాక నలుగురిని చితుకకొట్టడం జరిగింది, ఏమాత్రం అవకాశం లేకుండా సీనియరు అధికారులు దబాయిస్తే పోలీసుడిపార్టుమెంటు కుళ్ళిపోయింది, లాభంలేదని ప్రజలు అనుకుంటారు.

Mr. DEPUTY SPEAKER — దీనిక్రింద allot అయినది 1½ గంటలు మాత్రమే. మీకు ఇంకా 2 నిముషాలు మాత్రమే ఇస్తున్నాను.

Sri T. POTHA RAJU :— ప్రజల అభిప్రాయం ఈ విధంగా పోలీసులనుగురించి వున్నపుడు చాలా ప్రమాదకరం. పోలీసు డిపార్టుమెంటువల్ల ప్రజలకు వ్యతిరేకమైనచర్యలు మాత్రమే జరుగుతున్నాయి. లోపాలు సరిచేయడానికి సూచనలు కూడా నేను ఇస్తాను. కానిస్టేబిలు జీతం ఎంత? రు. 30 లు. రు. 19 D. A. కలిసిము రు. 50 లు అయినా basic pay ఇస్తే 0-4-0 కు, 0-8-0 కు కక్కుర్తి పడకుండా constables పని చేయగలరని నా విశ్వాసం. గంజి అయినా త్రాగడానికి

వీలవుతో [illegible] ఇ[illegible] పనిచేయడానికి వీలువుంటుంది. వీళ్ళకు ఇచ్చే T. A. సంగతి చూద్దాం. [illegible] అయితే 0-12-0, హైటకు పోతే 1-8-0 ఇస్తారు. అది [illegible] సరిపోతుంది? అంటే క్యాంపు వెళ్ళి [illegible] తే [illegible] పస్తులుండి తినాలి. Constables కు House rent ఇస్తున్నాం అన్నారు సంజీవరెడ్డిగారు. T. A. కు House rent అనుకుంటున్నారేమో నాకు తెలియదు. House rent కు ఇంటి యజమాని దగ్గర నుంచి receipt పుచ్చుకోవాలి. [illegible] ఇంటి యజమాని receipt ఇవ్వడు. రు. 10/- లు pay చేస్తే 5 లకు రసీదు ఇస్తాడు. House rent ఏదో flat rate ఇస్తే బాగుంటుంది. లేకపోతే ఇస్తే ఇచ్చినా సరే, నేను చెప్పింది ముఖ్యంగా lock out లు, మీటింగులు పెట్టుకొని మైకు పెట్టుకుందుకు పర్మిషను తీసుకోవడం విషయం ఆలోచించాలి అని కోరుతున్నాను ఈ విషయంలో ఒక advisory committee లాంటిది పెట్టినట్లయితే పోలీసులకు ప్రజలకు ఎక్కువ సహాకారం వుండడానికి వీలువుంటుంది. ఈ విషయం ప్రభుత్వం ఆలోచించాలి అని కోరుతూ, నేను చెప్పిన విషయాలు ప్రభుత్వం దృష్టికి తీసుకుంటుందని అనుకుంటూ, నేను విరమిస్తున్నాను.

Sri T. LAKSHMINARAYNA REDDI:—ఉపాధ్యక్షా, నామిత్రులు ప్రతిపాదించిన డిమాండును బలపర్చలేక పోతున్నాను. మంత్రిగారు మాట్లాడుతూ మనం ఇతర దేశాలకంటె ఈపద్దుమీద చాలాతక్కువ ఖర్చు పెడుతున్నామంటున్నారు. మన బడ్జెటును అమెరికా, ఫ్రాన్సు ఇంకా ఇతర దేశాల బడ్జెటుతో పోల్చకూడదు. మనది పేద దేశం. మన దేశంలో పోలీసు శాఖమీద ఎక్కువగా ఖర్చుపెట్టనక్కరలేదు. ఈ రాష్ట్రంలో స్వరాజ్యంవచ్చిన తరువాతకూడా పోలీసు దళాలు తగ్గలేదు. ఈ సంగతి మంత్రిగారి తియ్యటి మాటలలోనే కనిపిస్తోంది నేను మాట్లాడేది Law and Order కాపాడే పోలీసును గురించికాదు. Special పోలీసును తగ్గించాలి. 1951 52లలో వున్న పరిస్థితులు ఇప్పుడు లేవు. ఈ C I. D. పోలీసులు ఎవరికోసం? మంత్రిపదవులు రాని కాంగ్రెస్ వాళ్ళు మంత్రి వర్గం మీద కత్తికడుతున్నారన్నా నిజంగా దేశంలో ప్రజలను పీల్చి పిప్పి చేస్తున్న లంచగొండులను పట్టుకోడానికి వీరికి దమ్ములులేవా? మా జిల్లాలో జిల్లా అధికారి కలక్టరు అధికారాల్ని ఇన్సూర్యెన్సు కంపెనీలకు లాభం కలిగించడానికి ఉపక్రమించిన దానికి, పట్టుకోడానికి వీరు పనికిరారా? మంత్రిగారి దగ్గర ఉపయోగించుకునేందుకు అక్కె

పెట్టారా? కదిరి తాలూకాలో కొంతమంది గ్రామాలవారు గంజి కేంద్రాలు కావాలని తహశీల్దారుగారి వద్దకు వెళ్లగా పోలీసులు వాళ్ళను బయటికి నెట్టడమే కాకుండా వారిమీద కేసులు బనాయించారు. నల్లమాడ గ్రామంలో కూడా ఇదేవిధంగా జరిగింది. నా నియోజక వర్గంలో పామదుర్తి పోలీసుస్టేషను వుంది. అక్కడవుండే స్థానిక రెడ్లు తమప్రతిష్టలు కాపాడుకోవడం కోసము అమాయక ప్రజలను పీల్చి పిప్పిచేయడం కోసం ఆస్టేషనును ఉపయోగిస్తున్నారు. ఈసంగతి శ్రీ సంజీవరెడ్డిగారికి కూడా తెలుసు. అక్కడ వున్న పోలీసు అధికారిమీద చర్యతీసుకుందామంటే మంత్రిగారు సహకరించలేదు. కాబట్టి ఈ శాఖను ప్రజలకు ఉపయోగపడేటట్లు చెయ్యాలని కోరుతున్నాం. అట్లాచేయలేకపోతే వారిని వారి ప్రతిష్ఠకోసం వుంచుకొన్న గూండాలుగా భావించ వలసి వస్తుంది. గ్రామాలలో పోలీసుల పద్ధతులు మరీ విపరీతంగా వున్నాయి, కాబట్టి పోలీసును ప్రజా పోలీసులుగా తయారు చేయమని కోరుతున్నాను. లంచగొండితనాన్ని గురించి రిపోర్టుచేస్తే చర్య తీసుకోవడం అసలేలేదు. ప్రభుత్వం ఈ విషయంలో మా సూచనలను అంగీకరిస్తే మేముకూడా లంచగొండితనాన్ని రూపుమాపడానికి సహకరిస్తాము. మన దేశ ఆర్థిక పరిస్థితులకు అనుగుణంగా అనవసరపు సిబ్బందిని తగ్గించి ఆ డబ్బును మిగతా పనులకు ఉపయోగించుకోవాలి.

DEPUTY SPEAKER :— The House stands adjourned and will meet again at 9 A. M. to - morrow (8-1-54). The House then adjourned.

G. V. CHOWDARY
Secretary to the
Legislative Assembly

*APPENDIX I*

[Vide answer to starred question No. 48 asked by Pragada Kotaiah at the meeting of the Legislative Assembly held on 7th January 1954, page 21 supra.]

EDUCATION, HEALTH AND LOCAL ADMINISTRATION DEPARTMENT

**(Local Administration)**

# G. O. No. 107, 28th December 1953.

Tax—Property, House and Profession Taxes—Exemption of Weavers—Instructions issued.

**Order-No. 107, Local Administration, dated 28th December 1953**

In view of the prevailing depression among the handloom weavers and with a view to relieving their distress, Government consider that all persons whose principal means of livelihood is handloom weaving should be exempted from local taxes on property and profession. Local bodies are accordingly advised to exempt all such persons from property-tax house-tax and profession-tax for the current year. The previous sanction of the Government under section 117 of the Madras District Municipalities Act 1920; for exempting handloom weavers wholly from the payment of Municipal Taxes for the current year is hereby accorded. The loss to local bodies due to the exemption ordered above may be treated as an extraordinary charge within the meaning of rule 53 (6) of Schedule V to the Madras District Municipalities Act, Rule 4 (3) of Schedule V to the Madras District Boards, Act, 1920 and section 72 (3) (iii) of the Madras Village Panchayat Act, 1950 and the sanction of the Government or the Inspector of Municipal Councils and Local Boards to the incurring of such charge is hereby accorded.

2. Where any weaver has been assessed to any of the above taxes, the assessments may be treated as cancelled for the current year. If distraint proceedings or prosecutions are launched against any weaver for default in the payment of any of the above taxes, such proceedings may be withdrawn by the executive authority and any movable properties

attached in the course of distraint proceedings taken already, returned to the owners under appropriate acknowledgments.

3. The Inspector of Municipal Councils and Local Boards is requested to communicate the contents of the above orders to all Class II Panchayats urgently. He and all the Inspecting Officers working under him are requested to watch the implementation of the above orders and report to Government any default in their observance.

(By Order of the Governor)

S. R. KAIWAR,
*Secretary to Government*

*APPENDIX II*

[Vide answer to starred question No. 51 asked by Sri S. Narayanappa, at the meeting of the Legislative Assembly 7th January 1954 page 28 infra.]

*Statement showing the loans by Weavers Co-operative Societies under the relief scheme in the Anantapur District.*

| S.No. | Name of the Society | Amount for which the society is eligible calculated at Rs. 65/- per loan per month for 3 months. | Amount drawn from the Central Bank upto 30 11 '53 |
|---|---|---|---|
| 1. | Uravakonda Weavers Co-operative Society | 1,85,250 | 1,43,000 |
| 2. | Kalyandurg do | 50,310 | 47,325 |
| 3. | Yadiki do | 83,850 | 23,660 |
| 4. | Talamarla do | 12,675 | 19,623 |
| 5. | Chinnakothapalli do | 24,960 | 17,940 |
| 6. | Medikurthi do | 20,475 | 12,675 |
| 7. | Kummetha do | 22,035 | 7,345 |
| 8. | Kothalapalli do | 7,605 | 5,070 |
| 9. | Rayadurg do | 29,250 | 19,500 |
| 10. | D. Hirehal do | 14,625 | 14,625 |